సంపాదకులు

విశ్వనాథ సత్యనారాయణ

జువ్వాడి గౌతమరావు

---




# జయంతి

సంపుటి 2 సంచిక 7 జూన్ '60

ఆర్. ఎం. చిదంబరం

మాదిరాజు దేవీప్రసాద్

సుప్రసన్న

సంపత్కుమార

రామారావు

శతక్రతువు

కొలకలూరి

శ్రీనివాసమూర్తి

[illegible] శ్రీరామమూర్తి

[illegible] వేంకటేశ్వర్లు

ఆధునిక సాహిత్యగతిని సూచించే

హిందీ మాసపత్రిక :

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు....

కార్యాలయము :

౫౧౬, సుల్తాన్ బజార్

హైదరాబాద్.

# జయంతి

19

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః

సంపాదకులు

**విశ్వనాథ సత్యనారాయణ**

జువ్వాడి గౌతమరావు

కార్యాలయము

**ఉస్మాన్‌పురా, కరీంనగరము**

**సంవత్సర చందా రు. 8_00**

**విడిప్రతి 0_75 న.పై.**

# సంపాదకీయము

ఎక్కువ గ్రంథములువ్రాసి యేమి ప్రయోజనము; నిలిచెడి గ్రంథ మొక్కటి చాలును—ఈభావము కొందరు ప్రసిద్ధులైన యాధునికకవులు చెప్పుటకలదు. వారొండు రెండు మంచి గ్రంథములు వ్రాసినవారే. ఆ గ్రంథములవలననే వారికి ప్రతిష్ఠ వచ్చినది. నేటి కాలమునందభివ్యాప్తమైయున్న నూతనభావ సంపత్తిచేతగాని, ప్రాచీనులు చెప్పిన కొన్ని కావ్యగుణముల యొక్క ప్రాచుర్యముచేతగాని వారిగ్రంథములకు ప్రాశస్త్యమునుగలదు. వానియందు గుణములు లేవనుటకును వీలులేదు. కాని "పలుగ్రంథములు వ్రాసి ప్రయోజనమేమి" యన్నమాటలో నొక దురర్థస్ఫూర్తి కలదు. ప్రథమతః, పలుగ్రంథములు వ్రాసిన వాని కావ్యములయందు గుణాధిక్యముండుటకు వీలు లేదనియొక యభిప్రాయము దానియందు భాసించును. ఒకకవి బహుగ్రంథరచయిత యగుటవలన వానియందు గుణాధిక్యము పొసగదు అన్నసంగతి విచారణీయమగుచున్నది. ఏకవులొండు రెండు గ్రంథములు వ్రాసిరో, వారు తమ యనువదియేండ్ల జీవితములో పలుబదియేండ్లదే పనిగా నాయొండు రెండు గ్రంథములగూర్చియే యాలోచించియాలోచించి తమ యనువదియవ పడిలోనో డెబ్బదియవ పడిలోనో గ్రంథమును బూర్తిచేసి "నేనన్నియేండ్లు దీనిగురించి యాలోచించితిని. నాపాండిత్యము నాశిల్పము నాభావనావైశిష్ట్యము నాసర్వమయిన కవితాశక్తియు దీనియందిమిడించితిని" యని చెప్పినచో నదికొంత సమంజసముగా నుండునుగాని వారు తమ కావ్యములను చిన్ననాడే వ్రాసిరి. వానియందుగొన్ని గుణములున్నవి. వానిని గురించియే వారికి ప్రతిష్ఠవచ్చినది. ఆ గ్రంథములయందు వారి సర్వజీవితానుభవము, వారి సర్వపాండిత్యము నున్నవనుటకు వీలులేదు. కాదా. వారిచేతనే యప్పుడప్పుడింకొక సిద్ధాంతము చెప్పబడుచున్నది. "ఉత్తమమయిన కవిత్వము యౌవనమునందే వ్రాయగలడుగాని యెవ్వడును వార్ధక్యమునందు వ్రాయలేడు"—అని. ఈ సిద్ధాంతము ప్రకారము వారా గ్రంథములను యౌవనమునందే వ్రాసిరి. అందుచే నవియే యుత్తమగ్రంథములు. మరియెవ్వడయిన తన యనువదియవయేటనో, యనువది దాటిన తరువాతనో యొక గ్రంథమును వ్రాసినచో నాసిద్ధాంతము ప్రకారము తద్గ్రంథముత్తమ గ్రంథము కారాదు.

ఎవ్వఁడయినను దన జీవితము మొదటనే "నేను నా జీవితము మొత్తము మీఁద నొక్కటే గ్రంథము వ్రాయుదును"- అని కాని "నేను వంద గ్రంథములు వ్రాయుదును"- అని గాని నిశ్చయించికొనియుండఁడు. అట్లు నిశ్చయించుకొన్నచో వాని సర్వశక్తియు మొదటి వాని గ్రంథములో నుండుటయు, రెండవవాని పలు గ్రంథముల యందు బరచబడి పలుచబడుటయు సంభవించునని చెప్పవచ్చును. అట్లెవ్వఁడును దన యౌవనమున నిర్ణయించుకొనఁడు.

పెద్దన్నగారి మనుచరిత్రమును గురించి యొక ప్రథకలదు. ఆయన దానిని జీవితాంతము వ్రాయుచుండెనన్న ప్రథ. ఆయన ప్రతి పద్యమును జెక్కిచెక్కి సూంకు దేర్చి మునాయిదాగా దేర్చినాఁడు. సర్వత్ర యొక విలక్షణమయిన మాధుర్యమును సమకూర్చినాఁడు. ఆ రీతిగా బ్రతి పద్యమును దీర్చి దిద్దుటకు బహు ప్రయత్నము బహు కాలము కావలసియుండును. శ్రీనాథుని దీసికొన్నచో నాయన గ్రంథములు నేటికి నాఱు గ్రంథములైనను భాషయందు నిలిచియున్నవి. పెద్దన్నగారి పద్య రచనయందలి బిగువు తప్పినను శ్రీనాథుని పద్య రచనయందధికమయిన యొక విలక్షణమయిన మాధుర్యము లేదనుటకు వీలులేదు. పెద్దన్నగారి యొక గ్రంథమును నిలిచినది. శ్రీనాథుని యాఱు గ్రంథములును నిలిచినవి. తిక్కన్నగారి పదునేను పర్వములు నిలిచినవి. ఎఱ్ఱన్నగారి మూఁడు గ్రంథములు నిలిచినవి. హరివంశ మింత పెద్ద గ్రంథము.

నిలిచెడి యొక గ్రంథమనగా గ్రంథము యొక్క ప్రమాణము కూడ నీ మాటలో నిమిడియున్నదా; యున్నచో నూఱది వందల పద్యములుకల పారిజాతాపహరణమును గ్రంథమే. వేలకొలది పద్యములుగల భారతమును గ్రంథమే. కనుక గ్రంథమన్న మాటకు నర్థము నిర్ణయించుట కొంత కష్టమే. ఒకఁడు తనకున్న శక్తిని రెండు మూఁడు వందల పద్యములలో బ్రకటించును. మఱియొకఁడు కొన్ని వేల పద్యములమీఁద బ్రకటించును. రెండు శక్తులు నొకటియేనా? కొన్ని వేల పద్యములు వ్రాసిన కవియొక్క శక్తియు, భావనా పటిమయు నధికమనుటకు వీలున్నదా? "వేల పద్యములు వ్రాయవచ్చును; పిప్పిగా నుండవచ్చు"ననవచ్చును. పిప్పిగా నుండెడు లక్షణమొక కవి రచనయందున్నచో వాఁడు వేల పద్యములు వ్రాసినను బిప్పియే. రెండు మూఁడు వందల పద్యములు వ్రాసినను బిప్పియే. పిప్పి పిప్పియే.

ప్రశ్న యెచ్చట బుట్టుననగా నేది పిప్పి, యేది రసవంతము- అన్నచోట బుట్టును. యథార్థమైన ప్రశ్న యిది; పూర్వపు ప్రశ్న కాదు. ఏది రసవంతముకాదో యది పిప్పి. రసవంతమైన దేది? రసముకలది రసవంతము. రసమనగా నేమి? శృంగారాది రసములు

కలవు. అందునను వానిగురించి సంభాళించుకొనలేరు గనుక, సంభాళించుకొనుట కష్టము కనుక బూర్వులు వానిని మరికొంత సులభపరచిరి. రసము, రసాభాసము, భావము, భావాభాసము. నాల్గును రసకక్ష్యలో చేర్చిరి. కవులయొక్క సంఖ్య పెరుగుటకు వీలయినది. భాషలో బహు శబ్దములు వానియొక్క స్వార్థమునందుపయోగించబడుటయే గాక యనేక విధములుగా నుపయోగింపబడుటకూడ గలదు. కొన్ని శబ్దములు పలక్షకముగా వాడబడుటకలదు. కొన్ని శబ్దము లర్థ విపరిణామము పొందుటకలదు. ఉపలక్షకమనగా నొక యర్థమేమనగా తత్స్పర్శ మాత్రముచేత తద్గుణమచ్చుటనున్నట్లు వాడబడుట. ఒక పద్యము మధురముగానుండును. చక్కని శైలిలో నుండును. అందు రసభావములుండ నక్కరలేదు. అయినను జనులు దానిని రసవంతముగా నున్నదందురు. అట్లనుటలో నర్థమేమనగా ననాదినుండియు "రీతిరాత్మా కావ్యస్య" యన్న వామనుని సూత్రార్థమునకు వెనుకనున్న మనోవృత్తి పద్య రచనయందలి యొక విలక్షణమైన శిల్పము- శిల్పమనుట కన్న మధురాక్షర సంయోజన జనిత గుణము- పాఠకులు కవిత్వమునకు బ్రధానముగా భావింతురన్నది యున్నది.

భావమన్న శబ్దమున్నది. భావమనగా నాలంకారికులు చెప్పిన భావములు వేరు. కాని యీ శబ్దము లోకమునందలి యనేకములైన యూహలకుగూడ బ్రయోగింప బడుచున్నది. యథార్థమునకు భావము వేరు, ఊహ వేరు. ఒక మంచి యూహను జెప్పినచో మంచి భావమున్నదనుటకలదు. ఇది యర్థవిపరిణామము.

తరువాత ధ్వనివాదము వచ్చినది. ఈ ధ్వనివాదము వచ్చిన తరువాత పద్య రచనాగత శైలీ గుణాదులు కొన్ని ప్రదేశములందు విస్మరింపబడ్డవి. ఆ ధ్వని సిద్ధాంతమును బ్రపంచించినవారి యుదాహరణములందున్న పద్యములేవియు శైలీ రచనాగత గుణాదులు లేనివాని వారుదాహరించలేదు. ధ్వనియాత్మ యనుటచేత దానికి బ్రాధాన్య వివక్ష చెప్పిరి కాని పద్య రచనాగత వైశిష్ట్య మక్కరలేదన్నట్లు కనుపించదు. మానవులందరు బ్రతుకుచున్నారు. వారి కాత్మలున్నవి. వారికి సద్గుణాదులున్నవి. శరీరమున్నది గనుక వారి సద్గుణములకు వెల. శరీరము లేని జీవులనంతములు గాలిలో తిరుగుచుందురేమో మనకు దెలియదు. మనము చూడలేదు. ఆ జీవులు శరీరధారులు కారుగనుక మనకు ప్రసక్తి లేదు. శరీరధారియైన జీవునియొక్క జీవ లక్షణము నాత్మగుణములు మనకు విచారణీయములు. అట్లే పద్య రచనా సౌందర్యముకల కావ్యముయొక్క గుణములను ధ్వనియే మనము పరామర్శింతుము. లోకమునందు నొక సత్పురుషుడు కలడు. వాడు వ్యాధిగ్రస్తుడు. కొన్ని రోజులుగా మంచమునందు బడిపోయినాడు. వానికి వ్యవహార

యోగ్యత లేదు. వానివలన నితరులకు లాభము లేదు. అట్లే రచనా సౌందర్య పరిహీణ మయిన కావ్యాభాసమునందలి ధ్వన్యాదులును లోకోపకారకములైనవి కావు.

తాత్పర్యమేమనగా నొకడిన్ని గ్రంథములు వ్రాసెను- అన్నమాటయే కాదు. వాడెక్కువ వ్రాయవచ్చును, తక్కువ వ్రాయవచ్చును. ఇన్ని గ్రంథములు వ్రాసిన వాడు కనుక ఆ గ్రంథములన్నియు నిర్గుణములనుట పొసగదు. ఒక గ్రంథము వ్రాసినాడు కనుక వాని గ్రంథము నిస్సంశయముగా సర్వోత్కృష్టమనుటయు పొసగదు. ఒకడొక్క గ్రంథమే వ్రాసెను. మరియొకడు పది గ్రంథములు వ్రాసెను. ఇంకొకడు నలుబది గ్రంథములు వ్రాసెను. ఆ గ్రంథముత్తమమా కాదా యన్న విషయమును తద్గ్రంథ గత గుణపరిశీలన చేసి విమర్శించినప్పుడు తేలవలసినదిగాని తద్విమర్శానపేక్షకమై యనెడి గాలి మాటలవలన దేలునదిగాదు.

మరియు గుణములనగా నోజస్సు, సౌకుమార్యము, మాధుర్యము మొదలైనవి కలవు. అవి శాబ్దికములు, ఆర్థికములునై యుండును. శాబ్దికములైనవి పద్యము యొక్క రచనయందు, మాటల కూర్పునందు నధికముగా భాసించును. అట్టి శాబ్దికమైన మాధుర్యాది గుణము పరిమిత సంఖ్యాకులైన కవులయందే యుండును. ఒక దృష్టితో జూచినచో వారే కవులనవలయును. అట్లన్నచో వాఙ్మయము సంకుచితమైన స్థితిని బొందును గావునను, శాబ్దమాధుర్యాది గుణవంతమైన రచన చేయు కవుల గ్రంథములయందు తదితరమైన మహా విషయములు లేకుండుటయు జరుగవచ్చును. కావున మాధుర్యాది గుణము తక్కువయైనను తదితర గుణ సమృద్ధిగల కవులను గూడ కవులే యనుచున్నాను. నన్నయ్యగారి పద్య రచనయందలి మాధుర్యము తిక్కన్నగారి పద్య రచనలో లేదు. తిక్కన్నగారు మహాకవి కాదనుట యెట్లు?

ఇది యిట్లుండగా నింతకుమున్ను చెప్పిన యర్థ విపరిణామము పొందిన భావమన్న శబ్దము ప్రయోగింపబడు నూహలను. ఈ యూహయు, భావనయు నొక కోటిలోనివి. రస భావాదులు లేకుండ నట్టి యూహయొక్క ప్రాచుర్యముగల యొక గ్రంథముండును. దానికి గ్రంథత్వముకలదు. ఊహయొక్క సమృద్ధి చేత దానిని లోకము పాటించును. లోకమునందుకంటె నుదారత యెచ్చట సిద్ధించును! పశువులకు మేతగా కూడ నుపయోగపడుటకు వీలులేని నట్టడవిలో సమృద్ధిగానున్న పచ్చిగడ్డియొక్క పచ్చదనమును, సమృద్ధిని జూచి నేత్రమానందించును. అది యూరకే మొలచినది. అచ్చటికి పశువులు కూడ రావు. గ్రీష్మకాలము వచ్చును. ఎండిపోవును. ఇట్టివి గ్రంథములైన కావచ్చును. అనంతకాలము మీద నెన్నిగ్రంథములు పుట్టియుండవచ్చును. ఎన్ని యంతరించిపోయి

నవి. కొన్ని గుణములు గల గ్రంథములు కూడా నశించి పోవచ్చును. కొన్నాళ్లు, కొన్ని యేండ్లు నంతర్హితమై మరల నెప్పుడో కనుపింపవచ్చును. భాసుని నాటకములవలె.

నిలిచెడు గ్రంథములన్న మాట కర్థమేమి? ఎట్లు నిలుచును? నిలుచుటయన్నది యనేకమైన పరిస్థితుల మీద నాధారపడియున్న విషయము. అన్ని విషయములందు వలెనే సారస్వతమునందుకూడ నొక గ్రంథము నిలుచుటకు బాహిరములైన కారణము లెన్నో యుండును. ఈ కాలమునందు వాఙ్మయ చరిత్రయన్న నొక గొప్ప విషయము విశ్వవిద్యాలయముల చదువులవలన నమలులోనికి వచ్చినది, కనుక కవుల చరిత్రలు వ్రాయబడినవి, కనుక నెంతమంది కవుల పేరులో నిలిచినవి. సాహిత్యములో రస భావాదులను మించి మరికొన్ని గుణములు పాశ్చాత్య విద్యాబోధవలన కావ్యమునందు ప్రధానముగా పరిగణింప బడుచుండుటవలన మరికొన్ని గ్రంథములకు ప్రాశస్త్యము వచ్చినది. తంజావూరి సారస్వతములోని బహు గ్రంథములు చరిత్ర దృష్ట్యా తత్కాలములయందలి యాచారముల యొక్క యభ్యాస దృష్ట్యా నేడు పఠింపబడుచున్నవి. రఘునాథాభ్యుదయమున్నది. ఆ నాటి రాచకొలువు, వారి భోజనములు, వారి శృంగార రసము ముఖ్యముగా వివరించు గ్రంథము. ఆ భోజనాదులు, నా రాజుల నైసంగాన చర్య విజయనగర రాజులనుండి తెచ్చికొన్నది. చారిత్రిక దృష్ట్యా పరిగణనీయమైన గ్రంథము. యక్షగానములున్నవి. వాని వైశిష్ట్యము వానివి. కొన్ని భాషా దృష్టితో నిలిచికొనదగినవి.

కనుక కావ్యము నిలుచుట యనగా నెట్లు నిలుచునని, యిట్లు నిలువదని చెప్పుటకు వీలు లేదు. ఆంగ్ల సారస్వతముతోడి పరిచయము పలుమందికి కలదు కనుక నీ చెప్పబోవు నుదాహరణ మందలిది. అలెగ్జాండర్ పోప్ అన్నకవి, అతడు బ్రతికిన రోజులలో నంతకంటె నింగ్లీషుభాషలో నుత్తమమైన కవి యుండడనిపించుకొన్నాడు. వంద యేండ్లు దాటలేదు. అతని పద్యరచనయందు ధారాశుద్ధితక్క మిగిలినది లేదని తీర్మానింపబడినది. సారస్వత చరిత్రలో మాత్రము మిగిలినాడు.

కాలానుగుణముగా నొక్కొక్క కాలమున నొక్కొక్క భావ సముదాయమునకు ప్రాధాన్యము వచ్చును. కాలమునకు దేశమునకు నా యవసరము తీరిపోయినంతనే యా ప్రాధాన్యము పోవును. ఆ కాలమునందా గ్రంథము మహా గ్రంథము కావచ్చును. ఆ కాలమా భావములయొక్క సంపుటి. ఆ భావములతో బాటు నా కాలము మారి పోవును. ఆ కాలమునందు మహాగ్రంథముగా బరిగణింపబడినది భిన్న లక్ష్యములు గలిగిన మరియొక కాలమునందు గాకపోవచ్చును.

అన్ని కాలములయందు నన్ని దేశములయందు ననుస్యూతముగా నవిచ్ఛిన్నముగా

నుండునది మానవ స్వభావము. తత్స్వభావము ననుసరించి వ్రాయబడిన గ్రంథము నిత్యముగా నుండుననుట మానవ స్వభావమెంత నిజమో యంత నిజము.

ఒక సద్గ్రంథము చావవచ్చును. ఒక యసద్గ్రంథము నిలువవచ్చును. సిద్ధాంతములు మారవచ్చును. మానవ లోకమున ననంత ప్రకృతులుగల జీవులుందురు. కొందరు కవులు లోకోపకారము కొరకే వ్రాయుదురు. ప్రతిష్ఠను వాంఛించి వ్రాయరు. కొందరు డబ్బు కోసమే వ్రాయుదురు. కొందరు ప్రతిష్ఠకోసమే వ్రాయుదురు. కొందరు తత్ప్రతిష్ఠను జూపెట్టికొని లోక సంగ్రహము చేయుదురు. ఇన్ని గుణములు నవియవియే యని చెప్పుటకు వీలు లేదు. ఒకనికి ధనము కావలయును. ప్రతిష్ఠయు గావలయును. ఆ ప్రతిష్ఠను బురస్కరించికొని లోక సంగ్రహణమును జేయుచుండును. దీనిని గూర్చి యిదమిత్థమని యెవ్వడును జెప్పలేడు. మనుజుడు మాత్రము తానొక ధర్మమును మనసులో బెట్టికొని ప్రవర్తించవలయును. ఆ ధర్మమునకు వ్యతిరేకమైన పనులు లోకము ననుసరించి యొకొకప్పుడు కొన్ని చేయక తప్పదు. కాని యా లక్ష్యము చెడకుండ జూచికొనుచు బ్రతుకుట సత్పురుష లక్షణము. వీచిన ప్రతిగాలివెంట బడిపోయినచో నాగాలి కొల్లేటి నడిమికి బోయి యచ్చట నాగవచ్చును. ఇంతకు జెప్పవచ్చినదేమనగా "సరిచేసి గ్రంథమొకటి చాలును. ఇన్ని గ్రంథములు వ్రాసి యేమి ప్రయోజనము." అన్న మాటలో నధిక సామంజస్యము కనబడుట లేదు. షేక్స్పియరు ఒక "హేమ్లెటు" వ్రాసిన చాలును. ఇరువదియారు నాటకములు వ్రాసినాడు, అన్నియు నిలిచియున్నట్లే కనుపించుచున్నవి. ఇచట నీ నియమము లేదు.

# జీవుని వేదన - 6

## గుప్తపాదుని వ్యక్తివాదము.

ధూళిపాళ శ్రీరామమూర్తి.

పూర్వ వ్యాసమునందు కావ్యగతమైన బహు శిల్ప మార్గములందు జీవునివేదన యెట్లు ప్రతిబింబించుచున్నదో వివరించుటకు ప్రయత్నింతునని చెప్పియుంటిని. ఆ ప్రయత్నము చేయుటకుముందు వ్యంజకత యనగ నేమియో కొంత వ్యాఖ్యానింపవలయును. కారణమేమనగా కావ్యమందు ప్రధానమైన యర్థమును వ్యంజింపఁజేయుటయే కావ్యశిల్పము యొక్క ప్రాణము. వ్యంజకతను గుఱించి చెప్పగా తెలిసికొన్న తర్వాత శిల్పవైఖరులను వ్యాఖ్యానించుకొనుట తేలికయగును. అదియును గాక గుప్తపాదుడు సిద్ధాంతీకరించిన వ్యక్తినిబద్ధమైనది జీవునివేదనయే కావ్య పరమార్థమని మనకు విశదమగును.

గుప్తపాదుడు భరతముని కృతమైన రససూత్రమును వ్యాఖ్యానించు సందర్భమున నీ వ్యక్తి సిద్ధాంతమును ప్రతిపాదించెను. భరతుని రససూత్రము "విభావానుభావ వ్యభిచారిసంయోగాద్రస నిష్పత్తిః" అని. ఈ సూత్రముపైన బహువాదములు చెలరేగినవి. వానిలో ప్రధానమైనవి నాలుగు. అవి భట్టలోల్లటుని "ఉత్పత్తివాదము" శ్రీశంకుకుని 'అనుమితివాదము' భట్టనాయకుని 'భుక్తివాదము' అభినవగుప్తుని 'వ్యక్తివాదము'. ఈ వాదములకీ పేర్లు సూత్రగతమైన 'నిష్పత్తిః' అను పదమునకు వారు వారుచేసిన యర్థమునుబట్టి పుట్టినవి. లొల్లటుని మతమునుబట్టి రసము నాయికా నాయకులయందుపుట్టును. శ్రీశంకుకుని మతమునుబట్టి రసము నాయికా నాయకగతమైనట్లు అనుమానింపఁబడును. ఈ రెండు వాదములును రసము సామాజికునియందు గాక యతనికి బయట నాయికాదినిష్ఠమై యుండునని ప్రతిపాదించినవి. ఈ వాదములందు బహుదోషములు సన్నిహితములైయున్నవి. రసము నాయకాదినిష్ఠమనుటకు నటనిష్ఠమనుటకు వీలులేదు. ఆ రసమున కాశ్రయమైన నాయకాదులు వేరు. అందుచేత వారియందు రసము పుట్టుటకు వీలులేదు. నటనిష్ఠమనుటకు నటులయందు తాదృశ విధా సంవిధానమే కుదురదు. నటుడు చేయునది అనుకృతిగాని యథార్థ వ్యాపారముగాదు. నటుడు నాయకాదిగతమైన సుఖదుఃఖాదుల ననుకరించెననుటకును వీలులేదు. నాయకాదులకును నటునకును ఏకకాలీనత్వములేదు. అనుకరణ యథార్థవస్తు పరిజ్ఞానము నప్పుడే కుదురునుగదా? మఱియొకటి యేమన లొల్లటుడుచెప్పినటులు రసము నాయకాదినిష్ఠమైనచో సామాజికులకు దానియందు నాస్వాదము సంభవింపదు. లోకగతమైన పరగత సుఖదుఃఖములందు మనకాస్వాదము గలుగుటలేదు గదా! ఒకనికి పరగత రత్యాది చర్వణమువలన రాగము గలిగినచో మఱియొకనికి ద్వేషము గలుగవచ్చును. మఱియొకనికి లజ్జగలుగవచ్చును. ఇట్టి భిన్నానుభవము సామాజికులందు గన్పించుటలేదు. శాకుంతలాది నాటకదర్శనమువలన సామాజికులందు అభిన్నమైన శృంగారాది చర్వణ కలుగుచుండుట ప్రసిద్ధము. శ్రీశంకుకుడు రస నిష్పత్తియందు సామాజికులకుగూడ కొంత ప్రసక్తి కల్పించుట విశేషము. నాయకాదిగతమైన రసమును నటనిష్ఠమైనట్లు సామాజికుడనుమానించి తృప్తిచెందునని శ్రీశంకుకుని వాదము. అనుమానమనగా ఊహ. పరుల యందు రసాస్వాదమున్నదని యూహించుటవల్ల

సామాజికునకు గల్గు లాభమేమియో శ్రీశంకుకుడు వివరింపలేకపోయెను. ఇతరులకు ధనమున్నదని యూహించిన దరిద్రుడు ధనవంతుడగునా? అదిగాక యొకవేళ నేదియో యొక విధమైన తృప్తి సామాజికునకు గల్గునని యొప్పికొందమన్నను అచ్చమైన రసము సామాజికుని చర్వణకందుటలేదు. అది పరనిష్ఠమని శ్రీశంకుకుడొప్పికొనినాడు. ఇట్లీ వాదములు రెండును రసానుభవమునందు సామాజికుని నిరాకరించినవి. భట్టనాయకుడు ఈ దోషములన్నియు గమనించి తన భుక్తివాదమును ప్రతిపాదించినాడు. ఈయన యభిప్రాయమునందు రసము నాయకాది నిష్ఠముగాదు నటనిష్ఠముగాదు. సామాజిక నిష్ఠము. కావ్యమునందలి శబ్దార్థములందు రెండుశక్తులున్నవి. ఒకటి భావకత్వశక్తి. రెండవది భోజకత్వశక్తి. భావకత్వశక్తి సామాజికుని విభావాదులను భావింపజేయును. విభావాది భావనమువలన సామాజిక హృదయ నిష్ఠమైన స్థాయి సంచారులుద్బుద్ధములగును. అప్పుడు కావ్యగతమైన భోజకత్వ వ్యాపారమువలన సామాజికుడు స్వహృదయమునందుద్బుద్ధములైన స్థాయి సంచారుల నాస్వాదించును. ఇదియే రసనిష్పత్తి. అనగా భోగము.

న్యాయ్యమునకు భట్టనాయకుని భుక్తివాదము క్రొత్తదిగాదు. అతడు వ్యక్తివాదమునే మఱియొకరీతిగా చెప్పెను. ధ్వనిసిద్ధాంతులు చెప్పిన కావ్యగత వ్యంజనా వ్యాపారమునతడు రెండుగా విభజించి తన సిద్ధాంతమును ప్రతిపాదించెను. రెండు వ్యాపారములను కావ్యమునకు చెప్పుటయందు లాఘవములేదు. ఇట్లు చెప్పుటవలనే పైకి ధ్వని సిద్ధాంతమును ఖండించినను తాత్త్వికముగా భట్టనాయకుడు దాని నంగీకరించినవాడైనాడు. ఇందుచేత సమగ్రముగా కావ్యాస్వాదమును నిరూపించినది అభినవగుప్తుని వ్యక్తివాదమొక్కటే.

శాస్త్రీయమైన పరిభాషను వదలి చూచినచో గుప్తపాదుని సిద్ధాంతమును మన మీ క్రిందివిధముగా గ్రహింపవచ్చును. కావ్యమునందు ఏదేని యొక కథ వర్ణితమగును. కథ యనగా నొకటిగాని యంతకంటె నెక్కుడుగాని సంఘటనములు. సంఘటనమనగా నొకపని జరుగుట. ఒకపని జరిగినదనగా ఆ పని కార్యము. ఆ కార్యమట్లు జరుగుటకు కారణములు నుండవలయును. ఇట్లు కథ కారణ కార్యస్వరూపము. లోకమంతయు కర్మచితముగాన కారణ కార్యస్వరూపమే. అందుచేత లోకము కవికి కథ సామాజికులకు కారణ కార్యములను ప్రదర్శించును. కవి లోకమునందలి కారణ కార్య రూపమైన సంఘటనమును దీసికొని సామాజికునకు ప్రదర్శించును. లోక గతములైన కారణ కార్యములందు బహుదోషములు సన్నిహితములైయుండును. కవియందొక శక్తి యున్నది. దానికి ప్రతిభయని పేరు. ఇది కవియందు భావనారూపముగ నుండును. భావన యనగా పునఃపునరనుసంధానము. అనగా తిరిగి తిరిగి యొకే విషయమును మనస్సునకు పట్టించుకొనుట. ఇట్లు చేయుటవలన కవి తీసికొన్న సంఘటనమునందలి లౌకిక దోషములను నిరాకరించి వానియందున్న సౌందర్యమును దీపింపజేసికొనగల్గును. ఇందుచేత కవిగతమైన భావన గుణాలంకార సంయోజనాత్మకమైనదని గుప్తపాదుడు చెప్పెను. భావనవల్ల వస్తుగతమైన సౌందర్యమును కవి సాక్షాత్కరింపజేసికొనును. లేక దానియందు క్రొత్తగుణములను క్రొత్త యలంకారములను చేర్చి సంస్కరింపవచ్చును. ఎట్లయిననొక్కటియే. ఇప్పుడీ లౌకికమైన సంఘటన భావనను కవియందుద్బుద్ధమొనరించి యతని హృదయమునందు ప్రవేశించినది. కవి దానిని భావించుటవలన నొక తన్మయత్వమును బొందినాడు. దీని స్వరూపమును సామాజిక పరముగా తర్వాత వివరించుకొందము. ఈ తన్మయత్వమే రసము. కవి యే సంఘటనమును భావించుటవలన నీ తన్మయత్వమును జెందెనో యా సంఘటనమును

కావ్యరూపమున వెలయింపఁజేసినాడు. కవియందు ఈ సంఘటన భావనమునుద్బుద్ధ మొనరించినది. కవి భావనా భావితమైనది. కాబట్టి కావ్యమునందు దృశ్యమానమగు నా సంఘటన కేవల లౌకికమైనదిగాదు. కవిభావనా భావితమైనది. అనగా కవి ప్రతిభా సుపరిష్కృతమైనదని యర్థము. దోషరహితమైనది కాబట్టి కవిప్రతిపాదిత సంఘటనమునందు లౌకిక సంఘటనమునందు లేని యొకానొక యోగ్యత యొకానొక విశేష గుణము కవి దీనియందు సంయోజించినాడు. దీనికే 'వ్యంజన'యని పేరు. కవి సంఘటనమునందు సంయోజించిన గుణాలంకారముల వలన నాకృష్టుడై సామాజికుడు కవిప్రతిపాదిత సంఘటనమును భావించుటకు మొదలుపెట్టును. కావ్యగత గుణాలంకారములు భావనాజనకములని యభినవగుప్తుడు చెప్పెను. ఇప్పుడీ సంఘటన సహృదయుని హృదయమునందు ప్రతిబింబించినది. సంఘటన కారణ కార్యరూపమని పూర్వము చెప్పికొంటిమి. సామాజిక హృదయ ప్రతిబింబితావస్థయందీ కారణ కార్యములకు విభావానుభావములని పేరు. లౌకికములైన కారణములు రెండు విధములు- ఆలంబకములు, ఉద్దీపకములునని. లోకమునందు ఇద్దరు ప్రేమించుకొనిరి. అనగా నా యిద్దరు ప్రేమికులు పరస్పరము వారిప్రేమను వ్యక్తము చేసికొన్నారని తాత్పర్యము. ఆ ప్రేమికులట్లు వ్యక్తము చేసికొనుట కార్యము కాగా నా ప్రేమికులు ఆలంబన కారణములు. వారి ప్రేమ నుద్దీపింపజేయు పరిస్థితులు నుద్దీపకములు. వారి పరస్పర సంభాషణములు చేష్టలు కార్యములు ఇట్లు కారణ కార్యముల వలన లోకమునందు ప్రేమ యనుమానితమగుచున్నది. అనగా తాదృశ స్త్రీ పురుషులయందున్నట్లూహింపఁబడుచున్నది. కవి యీ కారణ కార్యములు సామాజికహృదయ ప్రతిబింబితములైనప్పుడు ఆలంబన విభావములు, ఉద్దీపన విభావములు, అనుభావములనని చెప్పఁబడును. కవి చేయు పనియెల్ల లౌకికములైన కారణ కార్యములకు విభావానుభావత్వమును సంపాదించుట మాత్రమే. లౌకికములైన కారణ కార్యములను యథా సంభవముగా గ్రహించి వానియందు హృదయ సంవాదమునుజెందు వైశద్యము సామాజికునకు లేదు. సామాజికునకు సహజముగా జీవ చైతన్యమునకు నావరకమై యాశీరూపమగు నజ్ఞానమున్నది. ఇది జీవునకు భేదబుద్ధికి కారణము. నాకు ఎల్లప్పుడు సుఖమే కలుగవలయును. సుఖసాధన సాంగత్యమే యుండవలయును. దుఃఖము కలుగరాదు. దుఃఖసాధనములతోడి సాంగత్యముండరాదని యెల్ల జీవులకు మూలభూతమైన యొక కోరిక యుండును. ఇదియే యజ్ఞానము. ఇందువల్ల లౌకిక సంఘటనములందున్న యంత సౌందర్యమును జీవుడు గుర్తింపలేడు. ఈ కోరిక జీవునకు తక్కిన విషయములతో భేదమును సాధించి పెట్టుచుండును గాన ననుకూల విషయాభిముఖ్యము అననుకూల విషయానభిముఖ్యము కారణములై జీవునకు విషయ జాలమునందు రాగద్వేషములను పుట్టించి లౌకిక సుఖదుఃఖముల ననుభవింపజేయును. కవికి నీ స్థితిలేదు. లౌకిక సంఘటనమునందు హృదయ సంవాదనము చెందు నైపుణ్యమాతనికున్నది. లోకమునందు సర్వకవులకట్లున్నదాయని యడుగవచ్చును. ఈ చెప్పునది యచ్చమైన కవి విషయము. అచ్చమైన కవి యట్టి స్థితిని పొందియున్నప్పటి విషయము. కొందరి యందు కవి శబ్దము గౌణముగా కొందరియందాభాసికముగా వ్యవహృతము కావచ్చును. ఏతాదృశ నైపుణ్యము సామాజికునకు సహజముగా లేదు గావున నతడు కావ్యమునాశ్రయించుచున్నాడు. కవి సమర్పిత విభావానుభావములను గ్రహించుచున్నాడు. కావ్యము విభావానుభావ సమర్పకమని గుప్తపాదుడు చెప్పెను. ఈ విభావానుభావములు సామాజికుని హృదయగతమైన స్థాయి సంచారాదులనుద్బుద్ధములు గావించి తన్మయీభవనము గల్గించును. విభావమనగా "విశేషేణ భావయన్తి స్థాయి సంచారాదీన్ ఇతి విభావాః" భావయన్తి అనగా ఉద్బోధయన్తి యని.

యర్థము. సామాజికుని హృదయమునందు అనగా జీవసంపుటియందున్న స్థాయి సంచారాదులను మేల్కొల్పును గాన నివి విభావములు. నాయకాదులు మలయానిల చంద్రాదికము. యదనుభావయతి వాగంగసత్వకృతో౽భినయః ఇత్యనుభావః. అభినయము(వాగంగసత్వ కృతమైత్రి రూపమైనది) అనుభావము. సామాజికుని హృదయమునందు మేల్కొనిన స్థాయిసంచారాదుల ననుభవింపఁజేయుచున్నది గాన దీని కనుభావమని పేరు. అనుభవమనగా తన్మయీభవనము. "తచ్చిత్తవృత్తి తన్మయీభవనమేవహ్యను భవనమ్." అని గుప్తపాదుని వచనము. ఇప్పుడు స్థాయి సంచారాదులను గురించి ప్రసక్తి కలిగినది. పూర్వము చెప్పిన జీవుని జీవచైతన్యమున కావరకముగానున్న యాశీరూపకమగు నజ్ఞానమువల్ల జన్మాంతరములయందు జీవుకొన్ని సంస్కారములను సంగ్రహించుకొన్నాడు. ఈ సంస్కారములు జీవసంపుటియందు మగ్నమైయుండి యనుకూల సామగ్రి సముపచితమైనప్పుడుద్బుద్ధమగుచుండును. వీనిని నలుబది యొకటిగా భరతముని గణించెను. వానిలో నెనిమిది స్థాయి భావములు. ముప్పది మూడు వ్యభిచారములు. ఆయాభావములకు జీవుని యాత్మపైన నధికారమును వహించు కాలపరిమాణమునుబట్టి స్థాయి సంచారి విభాగము చేయబడినది. ఈ భావములు జీవుని జీవసంపుటియందే యున్నవిగాని బయటనుండి తెచ్చుకొనవలసినవి గావు. ఈ భావముల యొక్క చర్వణయే రసము. ఇప్పుడు సూత్రమునందలి 'సంయోగాత్' అను పదమును గురించి విచారించవలెను. పూర్వము చెప్పిన విభావము సామాజికుని జీవసంపుటియందు నొక స్థాయి భావమును దానికి సంబంధించిన మఱికొన్ని సంచారిభావముల నుద్బుద్ధమొనరించినది. ఉద్బుద్ధములైన యీ భావములందు పూర్వముచెప్పిన యభినయ రూపమైన యను భావము సామాజికునకు తన్మయత్వము గల్గించినది. ఇట్లుద్బుద్ధములై యనుభూతములైన సంచారి భావములుగూడ స్థాయి భావముయొక్క యనుభవమునందుపచరించుచున్నవి. ఈ సంచారి భావములు క్షణావస్థితికములు. వీనియుద్బోధనము అనుభావనము క్షణక్షణము జరుగుచుండును. అందుచేత వీనికి నిలుకడలేదు. కాని యివి నిలుకడగన్న స్థాయి భావమున కనుకూలముగా ప్రతికూలముగా లేచుచు నణగుచునుండును. అందుచేత ఘాత ప్రతి ఘాతక్రమమున స్థాయి భావమును ముందునకు త్రోయుచుండును. ఇందుచేతనే వీనికి వ్యభిచారులని పేరు 'విముఖ మభిముఖంచ చరన్తీతి వ్యభిచారిణః.' వ్యభిచారి భావములు స్థాయ్యనుభవమునందుపకరించు పద్ధతి మఱియొక పద్ధతిగా నభినవగుప్తుడు చెప్పెను. వ్యభిచారి భావములు స్థాయియొక్క యనుభవమునందనుకూలముగనే యుపకరించునని యాయనమతము. రస మలౌకికమనుటకిదియొక కారణముగా గుప్తపాదుడు చెప్పెను. లోకమునందు గ్లాని శంకాదులు ప్రేమ విఘటకహేతువులగుచుండగా కావ్య సందర్భమున రసోపయోగులగుచున్నవి. ఈ యభిప్రాయము ననుసరించియే విశేషేణ ఆభిముఖ్యేన చరంతీతి వ్యభిచారిణః యని చెప్పికొనవలయును. ఇట్లు విభావము అనుభావము వ్యభిచారి భావము సామాజికునకు స్థాయ్యనుభవమునందుపయోగపడుచున్నవి. ఈ యుపయోగముయొక్క స్వరూపము లోకములో మనకు కన్పించునట్టిదిగాదు. లోకమునందునిమిత్తకారణములు రెండు విధములుగానున్నవి. కారకములు జ్ఞాపకములు. విభావాదులు కారకములుగావు జ్ఞాపకములుగావు. కారకములనుటకు రసము వానివలన పుట్టుటలేదు. రసమనగా స్థాయియొక్క యనుభవము. అనుభవమనగా చిత్తము తద్వికారమగుట. తద్వికారమనగా స్థాయి వికారమని యర్థము చెప్పికొన్నను నా సమయమున సాక్షి చైతన్యమున కావరకముగా నున్న యజ్ఞానము విగళితమై చిత్తమునందు చైతన్యపరిస్ఫృతి కలుగునుగాన తచ్ఛబ్దమునకు చైతన్యమనియే యర్థము చెప్పికొనుట సముచితము. దీనిని గురించి తరువాత విచారింతము. ఈ స్థితి విభావాది

భావనాసమకాలమునందే యుండువనిగాని తదనంతర ముందునదిగాదు. అందుచేత విభావాదులు కారకము లనుటకు వీలులేదు. లోకమునందు దండచక్రాది నిమిత్తనాశమున ఘటాది కార్యనాశము గలుగుట లేదు. మరి జ్ఞాపక కారణములుగావు. దీపము చీకటిలోనున్న వస్తువును జ్ఞాపకము చేయును. దీపము లేకపోయినను ఆ వస్తువట యుండనేయున్నది. దీప సద్భావము వస్తు సద్భావమునందు కారణముగాదు. వస్తు జ్ఞానమునందు కారణము. విభావాదులు లేనిచో రసములేదు. అందుచేత నివి జ్ఞాపక కారణములును గావు. ఇందుచేత నివి లౌకికములునుగావు. మఱి వీని యందు రసోపయోగిత్వమున్నది. అందుచేత వీనిని వ్యంజకములని గుప్తపాదుడు చెప్పెను అందుచేత సంయోగాత్ అన్నమాటకు వ్యంజనాత్ అని యర్థము చెప్పబడినది. వ్యంజన యనగా స్థాయి భావమును వ్యక్తముచేయుట. వ్యక్తము చేయుట యనగా సాక్షి చైతన్య గోచరముచేయుట. సాక్షి యనగా నావృత చైతన్యముగాదు. విభావానుభావముల పునఃపునరనుసంధానముచేయుటవలన సామాజికుని జీవచైతన్యమున కావరకముగానున్న యజ్ఞానము తొలగిపోవును. ఈ యజ్ఞానమే చిత్తగతమైన స్థాయి భావమునకు సాక్షి చైతన్య దీప్తి ప్రసరింపకుండ పూర్వము ప్రతిబంధించినది. స్థాయి భావము వ్యక్తమైనదన్నను స్థాయి భావమునందు జీవునకు తన్మయత్వము గల్గినదన్నను నీ ప్రతిబంధకము తొలగినప్పుడే సంభవించును. చిత్తగతమైన స్థాయి భావము సాక్షి చైతన్య సన్నిధానమున తళతళనాడుచు ప్రకాశించును. ఈ స్థితి రసము. విభావానుభావములను పునఃపునరనుసంధానము చేయుటవలన నీ స్థితి గలిగినది. భావనవలన వ్యంజన పుట్టును. వ్యంజన యనగా చైతన్యముయొక్క ప్రకాశమని యర్థము. దీనికే రసమ యనియు నాస్వాదన యనియు చర్వణ యనియు పేర్లు. ఒక్కమాటలో చెప్పవలయునన్నచో కావ్యగతములైన గుణాలంకారములవలన భావనపుట్టును. భావనవలన వ్యంజన పుట్టును. విభావాదులనుండి పుట్టిన ఈ వ్యంజనావ్యాపారమువలన స్థాయి భావము వ్యక్తమైనది. అందుచేత వ్యంజనయన్నను వ్యక్తి యన్నను నొక్కటే. రసము రసనకన్న వేరుగాదు. ఇచట నొక ముఖ్య విషయమును మనము గమనింపవలయును. సామాజికుడు చేయుచున్న పని యొక్కటి. జరిగినది మరియొకటి. అతడు భావించినది బాహిరమైన కథ. అనుభవించినది యాంతరమైన సంస్కారము. ఆలంకారికు లీ సందర్భమున నొక యుపమానమును చెప్పినారు. మాంసము లేని బొమికను కుక్క నమలుచు అది నోటిలో గుచ్చుకొనగా తన రక్తమునే యాస్వాదించుచు నాయాస్వాదము ఆ బొమిక నుండి వచ్చుచున్నదనుకొన్నట్లు సామాజికుడు తన జీవగత సంస్కారమునే యనుభవించుచు నది కథాగతమైనదని భావించునని. అందుచేత బాహిరమైన యాకథ యాంతరమైన యీ యనుభవమునకు వ్యంజకము. బాహిరమైన కథాభావనమువలన సామాజికుని చిత్తమంతఃప్రవణమై జీవసంపుటియందు మగ్నమగును. రసాకూతి ప్రచోదితుడై సామాజికుడు కథా భావనమునందు ప్రవృత్తుడగును. ఈ రసాకూతి పరమేశ్వర విరహ స్వరూపమని పూర్వము చెప్పితిని. సాక్షి చైతన్యము పరమేశ్వరస్వరూపము. జీవసంపుటియందు మగ్నమైన జీవుడు తన స్వరూపమును తాను దర్శించుకొని తృప్తిచెందును. జీవుడు జీవుడుగా నున్నంతవరకు నతని కీ విరహమున్నది. ఈ యాకూతి యున్నది. తనలో దాను మునిగిపోయినాడు. తానీశ్వరుడైనాడు. ఇట్లు బహిః ప్రసృతమగు చిత్తము వెనుకకు దిరిగి స్వాత్మదర్శనము గావించుకొనుటయే రసము. గుప్తపాదుడు చెప్పిన వ్యక్తి అచ్ఛమైన జీవుని చేవన.

అసలు నిండు ప్రాణాలుండగానే గణపతి శాస్త్రి గతించాడన్న విషయం పరమ విషాదం. ఇంతేకాకుండా యీయన గణిత శాస్త్రపుటీత సగపడలో ఉండగానే బుకుక్కు మన్నాడనడం నిజంగా భయానకం. ఆరోజు నీకు చద్దన్నం తినకుండానే చక్కాపొయ్యాకని తెలియడం ఆంధ్రదేశానికి తీరని దుఃఖం.

ఏది ఎల్లా ఉన్నా ఇది వ్రాయడం ఎటొచ్చి నా ప్రాణానికి పడడం కేవలం ప్రమాదం.

ఇంతమంది బ్రతికున్న జనాభా ఉండగా నేనే స్వయంగా చేయిచేసుకోడానికి తగు కారణాలు లేకుండ లేకపోలేదు. అందులో ఘనానివి మూడు.

1. అతని ఆంతరంగిక స్నేహితుడికి నేను ఆంతరంగిక స్నేహితుణ్ణి.
2. అతని ఆంతరంగిక విరోధిది మా ఆంతరంగిక విరోధిది అచ్చం ఒకే ఊరు.
3. వారి చనిపోయిన భైరవమూర్తి మా తోకలేని జాగిలం సాక్షాత్తు ఒకతల్లి బిడ్డలు.

ఇంతేకాకుండా పొనుగు చేసి పొక్కాలు పట్టించి పైకి మడచేవాళ్ళు ఆ చుట్టుపక్కల మేమిద్దరమే.

ఇటువంటి ఒహాలోకసం సంబంధాలు పోయిన శాస్త్రికి బ్రతికివున్న మరెవ్వడికి లేకపోవటం మూలాన్ని నేను చేయిచేసుకోకపోతే యీ ఆంధ్రపుత్రుడు ఏమన్నా అనుకోవ్వ

# గణపతిశాస్త్రి - గణితశాస్త్రం

మాచిరాజు దేవీప్రసాద్

పోతాడన్న భయంతో రెండుముక్కలు అందామని ఉద్దేశించా—

ఈయన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి అంటే యీయన జీవిత చరిత్రలో మొదటిభాగం కొంచం నంజుకోవాలి. ఈయన చిన్నప్పుడు– అంటే చల్లాడం లేకుండా బడికెళ్ళే రోజుల్లో–లెక్కల్లో పూజ్యం. ఎప్పుడన్నా జీరోకి పైనవస్తే వొట్టు. కాని ఆ జీరోనే ఆయన "రిసెర్చి" కంతా మూలకందం అని ఆయనే బ్రతికున్నప్పుడు చెప్పగా తెలిసింది.

నీకు ఈ సున్నాని నాలుగు పక్షాలుగా తరిగే (ముక్కావకాయ పద్ధతిని) సమ చతురస్రము (స్క్వేర్) నాలుగు భుజాలు సమాసమని తమిమ్మార్ల ఆంధ్ర దేశానికి చాటి చెప్పారు.

ఈ కార్య నిర్వాహణంలో వారుపయోగించిన పనిముట్లు ముఖ్యంగా ఉంపం, కొద్దిగా గునపం. వీటిని వారు సురక్షితంగా సంధించి

నట్టు ఇప్పటికీ చెప్పుకుంటారు. కాని ఒక నాడు దురదృష్టవశాత్తు, చిన్నచాకు, గుండు సూది ఉపయోగించి చిటికెన వేలికి గాయం కలిగించుకున్నారు. ఈ గాయమే వారికి ఇటీవల తటస్థించిన మరణానికి కారణం అని వాదించేవారు లేకపోలేదు. కాని దీనికి తగిన నిర్ధారణలు వ్రాతమూలకంగాకాని వాఙ్మూలకంగాకాని లేవని తెలియజేయుటకు ఆంధ్రదేశం తరఫున నేమెంతయూ సంతసించుచున్నాము.

వీరు రేఖాగణితంలో కామధేనువు. సంఖ్యాగణితంలో ఫిరంగి బెత్తె. వీరు సంఖ్యాగణితంగుండానే "బ్రిలిక్ మిస్కీ యింగువ" చాలా శ్రేష్ఠమైనదని తీర్మానించారు. తరువాత రేఖాగణితంవల్ల ఇది "షణ్ముఖం ను 'ద్రాక్షా' కన్నా రెట్టింపున్నర ఘాటైనది" అని ఖాయపరిచారు.

శుష్క శాస్త్రానికి (మెజరింగ్ టేప్) బోస్టాయనుకు తాత. ఆపస్తంబుని అచ్చం కన్నతండ్రి. మా గణపతి అంటారా కట్టె కొన్న వ్యక్తికి మొగుడు. ఆయన శుష్క శాస్త్రం మూలకంగానే ఇంత గొడవా ఇంత గాకాల మనిషి నడుము ఇంత లావు కావాలని గుణించారు. ఈ గుణితం ప్రత్యేక పట్టికల్లో గుప్తపరిచారు. గాంధీగారి నడుం ఉదాహరణకొని మహాత్మాయ "బ్రాహ్మణాయి" నడుందాక మధ్యనుండే నడుము ఎన్నింటికి కావలసిన నడుముకొలతల్ని యిందులో పొందుపరిచారు. ఎవరి నడుముకు ఎంత గుండు కావాలో దీని మూలకంగా సూక్ష్మకాలంలో సునాయాసంగా తెలుసుకోగలిగే వీలు సకల ప్రపంచానికి వీరు కలిగించినందుకు ధన్యవాదాలు.

ఈ అత్యుత్తమ గ్రంథంలో మొదటి పేజీలో వీరి త్రివర్ణ ఛాయాచిత్రంకూడా వేయించారని చెప్పడానికి తక్కన ఆంధ్రదేశం తరఫున నేమెంతయూ గర్వించుచున్నాము. వీరి పట్టికలు కాకపోయినా వీరి ఛాయాచిత్రము ప్రతి ఇంటా ఉండదగినది.

వీటి అన్నిటికన్నా వారు విశేషించి "పద సంఖ్యలు" అనే ఒక ప్రత్యేక శాఖా గణితానికి ధ్వజమెత్తారు. ఇది కేవలం ఆయనకొక్కరికే ఉపపడ్డ సర్వాంకష కృషి.

ప్రతిమాటకు ఒక విలువ ఉన్నదంటూ ఆయన తీర్మానం. అల్లాగే "తిరగవేస్తే" అనేదికూడా ఒక పదం కాబట్టి దానికీ ఒక విలువ ఉన్నదని ఆయన తగూ. తిరగవేస్తే=1 అన్నారు. మానసరాకి యీక్రింది సిద్ధాంతాలను సంగ్రహించుకోమని మనవి.

## పద సంఖ్యాగణితం.

సిద్ధాంతము ౧.

"తిరగవేస్తే" అను పదంబునకు సంఖ్యా విలువ ఏకంబు.

౧ వ ఉపపత్తి:

9 తిరగవేస్తే = 6.

6 తిరగవేస్తే = 9.

కూడిక... 15 తిరగవేస్తే = 15

∴ తిరగవేస్తే $= \frac{15}{15} = 1$

మ. కా. వ. *

దీనిని నిర్ధారణచేసి, ప్రాయోపవిష్టులై రెండు సంవత్సరాల మూడు నెలల మూడు రోజుల మూడు గంటల అర్ధ నిమిషం పాయింటు అయిదు సెకండ్లకు ప్రత్యేక విధానంమీద ఇది ఇంతేనని స్పష్టంగా ఖాయ పరిచారు.

౨ వ ఉపపత్తి:

13 తిరగవేస్తే = 13
3 తిరగవేస్తే = 3

త్రోసిపుడు. 10 తిరగవేస్తే = 10

తిరగవేస్తే = 10/10 = 1. లేక ఏకంబు.

మ. కా. వ.

ఇంతతో ఆపక 33 వ సూత్రములో "టాంటాం" అనే మాటయొక్క విలువ 120 అని కిమ్మత్తు వేసారు.

## పదసంఖ్యా గణితం.

సిద్ధాంతము ౩౩.

"టాంటాం" అను ద్వంద్వ పదంబునకు సంఖ్యావిలువ ద్వాదశ దశంబ.

ఉపపత్తి:

నూటారు = 106
నూ రు = 100

త్రోసిపుడు. టా = 6

టా = 6
∴ టాం = 60
టాంటాం = 2 × టాం
= 2 × 60 (చూ. రుజువు)
= 120
= 12 × 10
= ద్వాదశ దశంబ.

మ. కా. వ.

ఇంతతో ఆగకుండా ఇలా అనేక పదముల విలువలుకట్టి, వీరు కొన్ని ధర్మాలను నిజమేనని ప్రకటించారు.

ఈ విలువలగుండానే వీరు అష్టదిక్పాలకులు యెనిమిది మందేనని నొక్కి వక్కాణించారు. నవ బ్రహ్మలు తొమ్మిదిమందే నని ఒప్పుకొన్నారు. కాని బ్రహ్మతలకాయలను గురించి భేదాభిప్రాయం సూచించారు. అసలు బ్రహ్మకు తలకాయ అనేది లేదని వీరి వాదన. దీన్ని తేల్చుకోటానికే వారు యీ లోకం వదలి వెళ్లారా అనిపిస్తుంది, వారి ఉద్రేకం తెలిసినవాళ్లకు.

వీరు యింకా యిలా సంఖ్యా విలువల్ని సర్వతోముఖంగా పెంచి క్రొత్త క్రొత్త వాటికి అనువర్తింపించారు. అందులో చెప్పుకోతగ్గది,

సీతారాములు = కోడిపెట్ట.

అన్న క్రొంగ్రొత్త సిద్ధాంతము. దీని విధానము ఉపపత్తి (ప్రూఫ్) ఇక్కడ యిచ్చే వాళ్లమేకాని దాన్ని స్వహస్తంతో పై యేట జరిగిన కోటప్పకొండతిరుణాల్లో వారే పారేసుకొని వచ్చారని ఆంధ్రదేశానికి తెలియజేయుటకు నేం హోరున చింతిస్తున్నాము.

ఈ తప్పిదాన్ని పాఠక మహాశయులు మన్నింతురు గాత!

* మ. కా. వ = Q. E. D = మనకు కావల్సింది వచ్చింది.

# నిదాఘము | సంపత్కుమార.

క్రమము క్రమముగ నుష్ణ పరిమితి పెంచి
మరల తగ్గించి జీవ సమాజమందు
కలుగు మార్పుల శోధింపగా దివిరిన
మహిత శాస్త్రజ్ఞుడగుచు గ్రీష్మమ్ము వచ్చె.

తలయు మాడగ జెట్టు క్రిందకును జేరు
సర్పగుహ నీడ దరిజేరెనా-భయమ్ము
నెల్లి బాక్కి నిద్రించిన యతని కదియ
మూర దూరమ్ముగా బోయెనా-గయమ్ము.

పగతో నొక్కొకదానివెంట నొక్కట్లై బాధల్ వడెన్ దెబ్బతీ
యగ వ్రయ్యల్ వడినట్టి గుండెవలె నీ యంతమ్ము కన్పింప న
న్నెగడై కాసిన మోహతీవ్రతకు నెల్లన్ సైపగా లేక పె
న్నెగడై తా నెరియల్ వడెన్ బుడమి, అంతే బాధలల్ సృష్టిలో.

చలిగాలి యూడు శీతల శాఖ వృంతాలో
నవ్వులు విద్యుచ్చాపమనమ్ము లాయె
రేని వేడిమి నొవ్వగా నింబ ఫలములో
కరగి నీరగు మంచుగడ్డలాయె
కనుల నీడలు గూర్చ కజ్జల రేఖలో
నల్ల నల్లని గాజుకళ్లునాయె
ఎండ తగులనీక నుండెడు గొడుగులో
వట్టి యల్లిక తుంబుట్టలాయె

ఇరయు సహజ సుఖంకరమైనవాని
కన్న కృత్రిమ సుఖకారకమ్ములందు
హెచ్చు మోహమ్ము కన్పించు నీ సుఖమ్ము
శాశ్వతమ్ముగ గోరెడు జనమునందు.

ఆనంద మానందమని కుర్రిమ్మలాడుటే
కాని యానందమ్ము కలిగె నెచట ?
ఈ నిప్పు లుమిసెడు నెండలో, నెండగా
కన్పింపకుండెడు గాలిలోన,
గాజుబంతుల వేడి కాంతిలో, నిరుకైన
గదులలో, గదుల భాగములలోన
జీవిక కోసమై చేసెడు పనులలో
నానంద మధువు పొంగారు నేమి ?

ఎప్పుడో ఎక్కడో కొంచె మివతళించి
కానుపించు సుఖాభాస కలన జేసి
అదియె ఆనంద మానంద మనెడు జనము
ఈ నిదాఘాస గొంతు నెండించుకొనియె.

ఈ యెండ లొక్కటియే కాదు, దినసెచ్చ
ముల ధరలుల్ మండిపోవు మంటె
ఈ చెమ్వులన్ నీళ్లులేకాదు, సంగళ్ల
సమకులున్ బచ్చు కప్పారములున్యు
ఈ వేడి గాలు'క్కటే కాదు, కస్తు ప
దార్థముల్ మనసు నిస్త్రాణ పరచె
ఈ పిధులన్ దుమ్ము లేకాదు, కృతక మ
ర్యాదలు కళ్లు మూయంగ జేసె

కలత పెట్టుట ఋతువు నొక్కటియె కాదు
బ్రతుకుకూటను కలవర పరచె, నిజము
ఋతువు బ్రతుకును నొక్కడే కీడె సలిపి
సహన తగగణి మనిషిని బడలు పరచె.

ఈ గాలుల్ పగల్లు గాధలిడగా నేమయ్యె, రాత్రిమ్మనన్
నాగున్ ముగ్ధవనూ మనోజ్ఞము పరిష్వంగమ్మునం బట్టుచున్
వేన్రెస్తు ఈ బ్రతుకెల్ల కష్టముల గూర్చెన్ గాక యేమయ్యె, సా
ధ్వీ గల్లమ్మున చంద్రికా రుచుల గల్పించెన్ దరస్మేరముల్.

# సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర

"శతక్రతువు"

(గత సంచిక తరువాయి.)

"నన్నయ చలనస్థితిలో నుండగా స్త్రీలను వర్ణింపక ఎప్పుడు కదలికలేని స్త్రీలనే వర్ణించును." మరి నన్నయ్యగారి ఆదిపర్వమున చతుర్థాశ్వాసము లోని 41; పంచమాశ్వాసములోని 194; షష్ఠాశ్వాసములోని 189; అష్టమాశ్వాసములోని 178; సభాపర్వమున ద్వితీయాశ్వాసములోని 212; అరణ్యపర్వమున ద్వితీయాశ్వాసములోని 358; తృతీయాశ్వాసములోని 103, 106 పద్యములలో వర్ణితములైన స్త్రీలకు కదలిక కలదు.

"నన్నయ భారతమును రాజరాజనరేంద్రునకంకిత మీయలేదు. భారత శ్రవణ కుతూహలుడైన రాజరాజునకు నన్నయ్య తెలుగున వ్రాసి వినిపించెను." (పుట 250)

ఈ గ్రంథమునగల అనితఃపూర్వ సిద్ధాంతములలో ఇది అగ్రేసరభాసమానము. నన్నయ తన భారతమును రాజరాజ నరేంద్రునకీయలేదట. వాని "ఎఱ్ఱాప్రెగ్గడ భారతారణ్య పర్వశేషమును నన్నయభట్టు పేరితోడనే రాజరాజనరేంద్రునే కృతిపతిగా జేసెనని యారణ్య పర్వాంతమున నిట్లు చెప్పికొనె"నట (పు. 657). నన్నయ్య అంకిత మియ్యనిది అనగా కృతిపతిని చేయనిది ఎఱ్ఱాప్రెగ్గడ కృతిపతిగా జేయవలసిన అవసరమేమి? అసలు నన్నయ అంకిత మీయలేదనుటకు ఆధారమేమి? "ఏను విన్నపంబుసేయు తెలుంగున" అని తిక్కన అన్నాడు గనుక తిక్కన తన భారతమును హరిహరనాథున కంకితము చేయలేదనవచ్చును. విన్నవించుట యనగా వినిపించుట అనియే యర్థము. ఇది విపరీత ప్రతిపాదనమేకాక నిరుపపత్తికముకూడ.

(2) పీఠికలోని మరొక ప్రతిపాదన రంగనాథ భాస్కర రామాయణ కర్తృత్వములకు సంబంధించినది. "రంగనాథభాస్కర రామాయణముల కర్తృత్వములగూర్చి యనేక వాదోపవాదము లొకశతాబ్దమునుండి (?) చెలరేగుచున్నను బరిష్కారమునకు రాకున్నవి. రంగనాథ రామాయణ కర్తృకము (?) దొరకిన ప్రమాణముల బలమును బట్టియు, పండితుల వాదములందలి యౌచిత్యము బట్టియు నిర్ణయింపబడినది." (పీఠిక **xiii. xiv.**)

నిజమునకు ద్విపద రామాయణ కర్తృత్వమొక సమస్యకాదు. అది యనవసరముగా అగాధ సమస్యయైనది. అందుకు హేతువులు. ఒకటి: ద్విపద రామాయణకర్త గోన బుద్ధారెడ్డి అన్న కీ.శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు రెడ్డి అగుట. రెండు: రంగనాథుడు బ్రాహ్మణకవి అని భ్రాంతి పడుట. మూడు: ద్విపద రామాయణ కర్త గోన బుద్ధారెడ్డి అన్నది మొదట రామలింగారెడ్డిగారే అనుకొనుట. ఈ మూడు హేతువులును అవిచార మూలకములు. రామలింగారెడ్డిగారికంటె ముందు కీ.శే. సి. పి. బ్రౌను గారు 1840 వ సంవత్సరమున "ఈ రామాయణము అసత్యముగా రంగనాథుని కంటగట్టబడుచున్నది" అని వ్రాసినటుల శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి పీఠికలో స్పష్టము. (రాయల్ & కో వారి ప్రచురణము). అసలు ద్విపద రామాయణము వ్రాసినది రంగనాథుడు అని కల పూర్వ కథలో రంగనాథుడు రాజబంధువని స్పష్టముగా కలదు. (చూ. ఆంధ్రపత్రిక విక్రమనామ సంవత్సరాది సంచిక.

శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారి భాస్కర రామాయణ వ్యాసము.) రంగనాథుడు రాజబంధువు కాని బుద్ధారెడ్డి రాజ (పాలకార్థమున) పుత్రుడే. ఇక రామలింగారెడ్డిగారికి స్వకులాభిమానమువలె ఇతరులకు ఇతరాభిమానములు అవకాశముకదా ? ఈ ఆభిమానిక వ్యాపారము లెందుకు ? ద్విపద రామాయణ కర్త చక్రపాణి రంగనాథుడని వేటూరి ప్రభాకర శాస్త్రిగారి యభిప్రాయము. అందుకు ప్రమాణము లేదు. ప్రతిబంధకము కలదు. కాని ఈ గ్రంథములో అదే అనుపల్లవి. "బహుకాలము నుండి వ్యవహారమందున్న రంగనాథ రామాయణ నామమునుబట్టి దీని కర్త రంగనాథుడను కవి యని విశ్వసింపబడుచున్నది." పుట. 554. ఇట్లు విశ్వసించుట అవిచార మూలకము. దీనిని గురించిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి ప్రతిపాదన మిది గమనార్హము.

"ఒకవేళ రంగనాథుడే రచించి గోన బుద్ధభూపతి పేరు పెట్టెనన్నను బుద్ధభూపతుని కాలములో గాని, అతని కుమారుల కాలములోగాని దీనికి రంగనాథ రామాయణమను పేరు వచ్చియుండదు. ఇది తమ పేరుతో నున్నప్పుడు రామాయణకర్త బుద్ధక్ష్మానాథుడు కాని, అతని కుమారులుగాని దీనిని రంగనాథ రామాయణ మనుట నంగీకరింపరు కదా ! అట్లంగీకరించుట తమ ప్రతిష్ఠకే భంగము. కావున బుద్ధనరపాలునికి చాల తరములకు తరువాత, ప్రాయికముగా రంగనాథుడు రచించెనను ప్రతీతి యెటో యేర్పడి యది యక్కడక్కడ వ్రాత ప్రతులలో రంగనాథ రామాయణమని పేర్వడి క్రమముగా నది లోక వ్యవహారమున నల్లుకొనిపోయి ముద్రణము వచ్చిన పిదప రూఢమైనట్లు తోచుచున్నది. తంజావూరు శరభోజి మహారాజు సరస్వతీమహల్ లైబ్రరీలో నీ రంగనాథ రామాయణము ప్రతులున్నవి. ఆ లైబ్రరీలో పుస్తకముల పట్టికలో నిది వట్టి రామాయణ మనియే కలదు కాని రంగనాథరామాయణమని లేదు. "ఈ రామాయణమునకే (బుద్ధభూవిభుడు కర్త) రంగనాథ రామాయణమని వాడుక కలదు." అని యా పుస్తకముల పట్టిక తయారు చేసినవారు వ్రాసియున్నారు." పీఠిక. పుటలు 13. 14. కనుక రంగనాథ రామాయణ మనుట వాడుక కాని గ్రంథ నామము కాదని స్పష్టము "లాక్షణికులు దమ లక్షణ గ్రంథములలో 'రంగనాథుని రామాయణమునుండి' అని స్పష్టముగా ప్రమాణ వాక్యముల నొసంగిరి" పుట 554. మరి 'లాక్షణికులు తమ గ్రంథములలో ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్టు కృతమని, కవిజనాశ్రయము భీమన కృతమని, లక్షణసార మొకడు నన్నయభట్టు కృతమని స్పష్టముగా ప్రమాణ వాక్యముల నొసంగిరి.' కాని ఈ గ్రంథములు ఆ యా కవులవి గావని గ్రంథకర్తగారి ప్రతిపాదనమే. (పుట 209. 719). 'పూర్వ కవుల స్తుతులలో రంగనాథుని స్తుతించి'రని (554) మరొక వాదన. అంతమాత్రముచేత రంగనాథుడు రామాయణ కర్త ఎట్లగును? పూర్వకవి మాత్రమగును. వీని యన్నింటిని మించిన ప్రతిపాదన మింకొకటున్నది. ప్రమాణ రహితమైన విషయములను స్థాపించుటకు గ్రంథకర్తగారెంత దూరముపోగలరో దీనివలన తెలియుచున్నది. 'గ్రంథావతారిక కాండాంతములలోని కర్తృక విషయమును గోన వంశీయులు తరువాత మార్పుచేసియుండవచ్చును.' (557) ఎవరో వ్రాసిన "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వమున" కర్తృత్వ విషయమును 'శిష్టా' వంశీయులు మార్పుచేసిరన్నచో నెట్లుండునో ?

ఇన్ని యవస్థలుపడి ద్విపద రామాయణ కర్త చక్రపాణి రంగనాథుడని గ్రంథకర్తగారు తేల్చిరి (557 నుండి 600). కాని దీని కన్నియు అభ్యంతరములే. పోగా భాస్కర రామాయణ కర్తృత్వ నిర్ణయమునకు గ్రంథకర్తగారు అంతర ప్రమాణ,

బాహ్యప్రమాణ, జనశ్రుత్యాది కొన్ని సూత్రము లేర్పరచిరి. వానిని తామే ధిక్కరించిరి. బాహ్యాంతర ప్రమాణములు దొరికినచో జన శ్రుతిని దిద్దవచ్చు నని కూడ వ్రాసిరి. కాని ఆ జన శ్రుతియే రంగ నాథ కర్తృత్వ పునరుద్ధరణకు వీరికి సాధనమైనది.

ఇక భాస్కర రామాయణ విషయము: ఇది నిజముగ పెద్ద అగాధ సమస్య. ఇంకను పరిశోధనీ యము. అయినను శతాబ్దమునుండి చిక్కుపెట్టిన సమస్య పరిష్కారమునకు వచ్చినది అని గ్రంథకర్త గారానంద మందిరి. ఈ సమస్యను గూర్చి 'దైవ వశమున' వీరికి 'కొంత బలమైన ఆధారము దొరికి నది.' ఆ యాధార మిది: "భాస్కర రామాయ ణము సక్రమముగా మొదటినుండి నేను మరల చదువ ప్రారంభించి, యొక భాస్కరుని యారణ్య కాండము తరువాత మరియొక భాస్కరుని యుద్ధకాం డమునకు దాటిపోతిని. మధ్య కిష్కింధా సుందర కాండముల శైలి బాలకాండ రచన వంటిదే యని దాటిపోతిని. ఇందుచే నారణ్యకాండ చివరిగల పద్య మొకటి యుద్ధకాండారంభముననే మరల నాకింటబడి నది. వెనుకకు తిరుగవేసి రెండు పద్యములను జాగ్రత్తగ బోల్చిచూడగ, సంబోధనమున క్రియల వచనమున దప్ప మిగిలిన పద్యమంతియు నొకటే నగలు. దీనిబట్టి పూర్వవాదములను పునః పరిశీలన మొనర్చి, పూర్వపక్ష సిద్ధాంతముల నిర్ణయించి, యా మా కాలమందలి (?) యాంధ్రభాషా లక్షణము లతో పూర్వపక్షవాదమును పునః విమర్శించి సిద్ధాంత మును స్థాపింపవలసి వచ్చినది." (xiii, xiv).

ఇట్టి నకళ్లు ఇతరకవులమధ్యను ఇతోధికము. అది 'సంవిదాన్యో మేధావినాం బుద్ధయః' అనదగినది కాదు కాని ప్రతిబింబాకార సంవాదము, ఆలేఖ్యాకార సంవాదము, దేహాంతరితుల్య సంవాదము అనబడి నది మాత్రమే. ఇతర కవులమాట అటుంచి, ఇటు వంటి కర్తృత్వ సమస్య ఇంతకుముందు కల ఆరణ్య పర్వమునందు నన్నయభట్టు సభాపర్వములోని 'రయ విచలత్తురంగమ తరంగములన్' అను పద్యము యథాతథముగ అలతి మార్పున కలదు. అంతమా త్రమున ఆరణ్య పర్వ కర్త నన్నయభట్టు అనుట యెట్టిదో ఇంతమాత్రమున ఆరణ్య యుద్ధకాండల కర్త ఒకడే అనుటకూడ అట్టిదే.

ఇది ఆరణ్య కాండము. ఇది యుద్ధకాండము అని ఇదమిత్థముగ కర్తృవివక్షను తాళపత్ర గ్రంథ పరిశీలనమున నిర్ణయింపకుండ కలగూరగంపయైన అచ్చుప్రతినిబట్టి ఆరణ్యకాండ యుద్ధకాండల కర్త ఒక్కడే అనుట అసందర్భము. ఇదుపరి అట్లు నిర్ణీతములైన ఆరణ్యకాండ యుద్ధకాండలయందు రచనా సాదృశ్యమున్నను కర్త ఒక్కడే అనుట ప్రతిపక్ష రహిత సిద్ధాంతము కాజాలదు.

భాస్కర రామాయణ కర్తృత్వ విషయమున వీరు చూపిన ఉపపత్తు లన్నియు ఇట్లే దుర్బలము లును అపసిద్ధాంతములును అయియున్నవి. విస్తర భీతిచేత వాటి నన్నిటి యుదాహరింపక వదలుచున్నాను.

భాషాచ్ఛందో విషయములను బట్టి నన్నయ భట్టుకంటె నన్నెచోడుడు పూర్వుడన్న పూర్వపక్ష మొకటు సాహిత్య చరిత్ర మఱచిపోయిన సంగతి కాదు. సదృశమైన రచనా సాదృశ్యమునుబట్టి వల్లభామాత్యుని క్రీడాభిరామమే గాక చింతలపూడి ఎల్లనార్యుని (అనంతయ్య?) విష్ణుమాయా విలాస మను నాటకముగూడ శ్రీనాథ కృతమను పూర్వపక్ష ములును సాహిత్య చరిత్రకు తెలియని సంగతులు కావు.

ఇంత వివాదగ్రస్తమైన భాస్కర రామాయణ విషయమున ఒక తాళపత్ర గ్రంథమైన చూడకపో వుట ఘనకార్యము. ఎన్ని తాళపత్ర గ్రంధములు ఎందుకు చూడవలెనో వాగంటి శేషయ్యగారు 1948 లో స్పష్టముగా చెప్పిన సంగతి. 1957 లో

తయారైన 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వ' గ్రంథకర్తగారు కనీసము తాము కల మద్రాసు విశ్వవిద్యాలయ మందలి తాళపత్ర గ్రంథ విశేష మొక్కటియును తెలుపలేదు. కాని తాళపత్ర గ్రంథములు చూడవలెనని సూచన మాత్రము చేసిరి. అనుపలబ్ధ తాళపత్ర గ్రంథములనుగూర్చి తాపత్రియమే కాని ఉపలబ్ధ తాళపత్ర గ్రంథ పరిశోధనము చేయబడుట లేదు.

గ్రంథ రచనమునకు పరిశీలించిన పుస్తకములను, సంప్రతించిన గ్రంథములను వీరు ఆయాప్రకరణముల, పుటల క్రిందను పేర్కొనిరి. అట్లు పేర్కొనుటనిజముగా ప్రశంసార్హము. అనేకాధునిక సాహిత్య పరిష్టలకును, సాహిత్య స్రష్టలకును ఇది అవశ్యము నేర్చుకొనవలసిన విషయము. కాని అట్లు పేర్కొని అన్యథాకరించుట అనుచితము. అష్టమ ప్రకరణమున పేర్కొన్న సంప్రతించిన గ్రంథములలో శ్రీ కందుకూరి వీరేశలింగముగారి 'ఆంధ్రకవుల చరిత్ర' ఒకటి. భాస్కర రామాయణము బహుకర్తృకమగుటకు హేతువుగ వీరేశలింగము గారి "ఆంధ్రకవుల చరిత్ర" లో (పుట [illegible]) కల సమస్వయము 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము' నందు ఆంత్రి మార్పున అనుసంధితము. భాస్కర రామాయణ విషయమున ఈ గ్రంథములోని బహువిషయములు ఆంధ్ర కవుల చరిత్రములోనివే. కనుక వీరేశలింగముగారి తప్పులైనను యథాతథముగ గ్రహింపబడినవి. వీరేశలింగముగారి తప్పును నేలటూరి వేంకటరమణయ్య గారు తెలిపిన వ్యాసమును సంప్రతించియు రామకృష్ణశాస్త్రిగారు ఆ తప్పును సవరింపకపోవుట ఆశ్చర్యము.

"పంతులుగారి వాదములలో రెండు విషయములు పరామర్శింప దగినవి యున్నవి. మొదటిది అయ్యలార్యుడు శాకల్యమల్లుని పుత్రుడనుట. ఇది తప్పు. వ్రాత ప్రతులన్నిటియందును "శాకల్య మల్లకవి వరరామ (వీర) నరసింహావరజాప్పలార్య నందన.... అయ్యలార్య విరచితంబైన" అనియే యున్నది. దీనికి పంతులుగారు శాకల్యమల్లుని యొక్కయు, రామనృసింహుని యొక్కయు తమ్ముడైన యప్పలార్యుని పుత్రుడని వివరము వ్రాసిరి. కాని "శాకల్య మల్లకవి వరరామ (వీర)నరసింహ" యను వాక్యమునకు శాకల్యమల్లుని పుత్రుడైన రామ (వీర) నరసింహుడని యర్థముచేసికొనుట సమంజసము. కొమ్మయ తిమ్మడు, పోలయ వేముడు, గుండయ నారసింహుడు, నరసింహ కృష్ణరాయడు ఇందుకు తార్కాణ. కావున అయ్యలార్యుని వంశ వృక్షము ఈ క్రింది రీతిగ నుండవలయును.

శాకల్యమల్లభట్టు (1315 - 1350 ?)

రామ (వీర) నరసింహుడు. — అప్పలార్యుడు

అప్పలార్యుడు → అయ్యలార్యుడు.

అని వేంకటరమణయ్య గారి ప్రతిపాదన. అయినను 'శాకల్యమల్లుని తమ్ముని కుమారుడగు నయ్యలార్యుని' అని రామకృష్ణశాస్త్రి గారి యనుసరణము! అంతేకాదు అయ్యలార్యుని కాలనిర్ణయమునకు ఆధారమైన వేదగిరినాయని ప్రసక్తి అనేక తాళపత్ర గ్రంథములందున్నను అది ప్రక్షిప్తమని వీరేశలింగముగారి వలె రామకృష్ణశాస్త్రిగారు కూడ నిర్ణయించిరి.

ఇదే ఈ గ్రంథమునందలి 121 పుటలోని పట్టిక శ్రీ గంటిజోగి సోమయాజిగారి 'ఆంధ్రభాషా వికాసము' సంపుటి 51 పుటలోని పట్టికకు 'టిప్క్ ఫోటోగ్రఫీ!' ఆంధ్రభాషా వికాసములోని పట్టికయే కాని అధస్సూచిని చేర్చలేదు కాబోలు. పుణుమావి జంగ్లిగుండు శాసనమున "వేపూరు" కలదని ఈ గ్రంథమున కలదు. పుణుమావి జంగ్లిగుండు శాసనమును స్వయముగ చిత్తగించిన అట్లు వ్రాయుట

అసంభవము. ఆ శాసనమునందు 'వేపూరు' అని లేదు. 'వేపురకే' అని కలదు. "కుమారద తస్య గామే వేపురకే వత వేన గహపతికేన...." అది వేపూరు అయియుండునని ఆంధ్రభాషా వికాసము లోని అధస్సూచికలోని సమన్వయము. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము 89, 90 పుటలలోని 'తెనుగు వ్యుత్పత్తికి' భాషావికాసము 29, 30 పుట లలోని 'తెనుగు దిగ్వాచి' అను ప్రకరణమే ఆచ్ఛ ప్రకృతి. అయినను 'భాషావికాసము' సంప్రతించిన గ్రంథముల జాబితాలో లేదు.

ఇదే విధముగ 699 పుటలోని నాచన సోమ నాథుని కవిత్వము గురించిన సత్త్వరజస్తమో వివక్ష శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి పాఠము. విద్యార్థుల నోట్సులందును కల విషయము. ఆ 'నోట్సు' ఆవాత పరంపరా పరిమళ వ్యాపార లీలాసమన్వితము లని అనేకులకు స్వానుభవము. వానిలోని బహు విషయములు ఈ గ్రంథమున బాహాటములు. కాని గుణస్వీకారమునకు లక్ష్మీకాంతము గారి పేరు గ్రంథ మున ఎక్కడను కనిపించదు. ప్రత్యాఖ్యానమునకు మాత్రము ఎచ్చటనైన కనిపించగలదు.

మొత్తముమీద రామకృష్ణశాస్త్రి గారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము' ఆంధ్ర వాఙ్మయ విచిత్ర సర్వస్వము. కాని 'తెనుగు కవుల చరిత్ర' లోని (పుటలు 226-230) 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వములోని (పుటలు 770-775) వ్యాస సూచికలు ఆ గ్రంథములకంటె అధిక ఉపయోగకరములు. వ్యాస సూచికలనగా ఎవరు, ఎప్పుడు, ఏ కవి మీద ఎక్కడ, ఏ శీర్షికను వ్యాసములు, గ్రంథములు వ్రాసి నదియు తెలియజేయు పట్టికలు. ఈ పట్టికా పరిజ్ఞా నము కూలంకషముగా కలవారు ఇట్టి పట్టికలే ప్రక టించిన ఎంతైన ప్రయోజనముండుట నిజము. ఆ ప్రయోజనమును అలతి మాత్రము కాదు. ఇక సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రకు ఇతర సాహిత్య వేత్తలు ప్రయత్నించిన ఇతోధిక ప్రయోజనము తప్పదు.

# మూగ మనసు

ఆర్. యం. చిదంబరం.

స్మృతిపథంలో ఎక్కడో దూరంగా వున్న నాన్నను గురించి ఆలోచిస్తూ, చెదరిపోయిన గాజుముక్కల్ని ఏరి నిలువుటద్దం తయారుచేసినట్టు, రూపకల్పన చేసుకుంటుంటే పాపను శారద గద్దించటం వినపడింది. పాప కనుపాప లాంటిది. కనుపాపలైతే రెండున్నాయి కాని పాప మాకు ఒక్కతే. గారాబం నన్ను అప్రయత్నంగా క్రిందకు తీసుకు వచ్చింది. 'అన్నం వద్దంటోంది. వంటికే ఏ రోగమూ లేదు. ఏవిటిదంతా?' అనడిగింది శారద. ఆకలికి పాపకూ స్నేహితం చెడింది. శారీరకంగా ఏ వ్యాధి లేనప్పుడు ఇలా మొండికేస్తే పాప మాటల్లో నిజాన్ని వెదక వలసి వస్తోంది.

'పాపా! నువ్వు అబద్ధం చెబుతున్నావ్! తల్లిదండ్రులతో అబద్ధమాడకూడదు. తెలిసిందా? నువ్వు చెప్పకపోయినా, నేనూహించగలను. పొద్దున్న హెడ్మాష్టారితో నువ్వు వాదించిన విధానం నాకు బాగా తెలుసు.'

పాప బెదరింది. చీకట్లో వెలుగు కిరణాన్ని వెదకిపట్టుకున్నా నన్న మాట.

'అవును నాన్నారూ! పాపం! ఆ తాత చాలా మంచివాడు. ఎప్పుడూ, ఎందుకో ఏడుస్తూనే వుంటాడు. నన్ను చూడగానే మరీ ఏడుస్తాడు. ఎందుకంటే చెప్పడు అతనంటే నాకు చాలా ఇష్టం.

పాప ఆలోచనల మెట్లవెంబడి నడచి వెళ్ళి శిఖరం ఎక్కి కూర్చుంది. శారద కంగారు పడింది. ఆమెకు ఆద్యంతాలు అర్థం కా లేదు.

'ఆ ముసలాడిమీదే నీకెందు కింత అనురాగం? వీధిలో వెయ్యిమంది ఏడుస్తారు. అందర్నీ ఇష్టపడతావా? జీవితంలో ఏదో పోగొట్టుకున్న వారిలా ఏడుస్తారు. ఆకాశంవంక చూసి దీనంగా ఏడుస్తారు. నా ళ్ళందర్నీ ప్రేమిస్తావా? తప్పమ్మా! జీవితంలో ఎవర్నీ ప్రేమించకూడదు'- శారద అడ్డుపడింది.

'అదేవిటండీ? ఇలా అర్థం లేకుండా మాట్లాడుతున్నారు? దానికేం తెలిసి చస్తుంది?'

ఒకొక్కప్పుడు మనసు పట్టాలుతప్పి అసందర్భంగా మాట్లాడుతుంది. నా ఆవేదన-కనిపించని నాన్నకోసం కలవరించటం- చిన్ననాటి ఫోటోను ఆధారంగా తీసుకుని, కాలం తీసుకువచ్చిన పరివర్తనల్ని కలిపి, చిన్న చిన్న మార్పులుచేసి ఈనాటి నాన్నను సృష్టించు

కుంటున్నా. అది కేవలం మిథ్య అని తెలియగానే ఆ మనోభావాలు కరగి కన్నీళ్ళలో అంతమవుతాయి. అప్పటికే ఆకాశం వాన కురిసి వెలుస్తుంది. సూర్యుడు తొంగిచూస్తాడు.

'మరే నాన్నగారూ! కానీ ఇస్తేచాలు— బోలెడు మిఠాయిలు పెడతాడు. అసలు ఏమీ ఇవ్వకపోయినా సరే బఠాణీలు దోసిట్లో పోస్తాడు. బుల్లి బుల్లి చక్కటి కథలు చెప్తాడు. అతను నవ్వుతుంటే భలే తమాషాగా వుంటుంది. డబ్బు లేదంటే మెళ్ళో గొలుసు తీసుకోమన్నాను ఓనాడు. వద్దులే— అవుసరమైనప్పుడు తీసుకుంటానన్నాడు.'

శారద బంగారు గొలుసు ప్రస్తుతం మెళ్ళో వున్నది లేనిది నిర్ధారణ చేసుకున్న తరువాత 'చూశారా! వ్యవహారం ఎంతవరకు ముదిరిందో! ఇదంతా ఏదో ఎత్తుగడ— ఏ మందో మాకో కలిపి పెడుతున్నాడు. గొలుసు దీన్ని మూటకట్టుకుని తీసుకుపోతాడు. దాంతో నాకున్న ఒక్కగానొక్క సంతానం శాశ్వతంగా దూరమౌతుంది. ఆ తాతను జైల్లో పెట్టండి. రోగం కుదురుతుంది' అంది. అది మాతృహృదయం.

'సరేలే! చూద్దాం!' అనేసి మేడమీదికి వచ్చాను. పాప నిద్రపోయాక శారద కూడా వచ్చింది.

'అవునుకాని, స్కూల్లో ఏదో జరిగిందన్నావు. ఏమిటది?' అని అడిగింది.

“ఆ మిఠాయి తాత ఏడాదినుండి స్కూలు గేటు దగ్గర తినుబండారాలమ్ముకుని జీవిస్తున్నాడు. కేవలం డబ్బుకోసం అతను వ్యాపారం చేస్తున్నట్టు కనబడదు— చిన్న పిల్లలంటే ఆప్యాయత. ఇన్స్పెక్టరువచ్చి చూసిపోయాక, ఈగలు, దోమలు ముసిరే ఆ పదార్థాలు కొనటం మంచిదికాదని, తగిన చర్యతీసుకోమని హెచ్చరించి పోయారు. హెడ్మాష్టారు వెంటనే అతని దుకాణం మూయించారు. తరువాత పిల్లలు ఏమీ జరగనట్టు ఊరుకున్నారు, కాని పాప మాత్రం హెడ్మాష్టారితో ఆ తాతను గురించి 'ఏవిటేవిటో' చెప్పి ఏడ్చింది. ఆయనకూడా ఆశ్చర్యపోయారు”.

ఆ మర్నాడు ఉదయం కబురు ఎగిరి వచ్చి పడింది. వెళ్ళేసరికి హెడ్మాష్టారి ముఖంలో ఆందోళన పిచ్చిగీతలు కనిపించాయి. తలుపు దగ్గరగా చేరవేసి చెప్పుకుపోయారు.

'కొంప మునిగింది. ఇవ్వేళ జీతాలిచ్చే రోజు. అందుకని బాంకునుంచి నిన్న సాయంత్రం రెండువేలు తెప్పించాను. ఈ డ్రాయరులో వుంచాను. పొద్దున్నకూడా వుంది. తొమ్మిది గంటలకు ఆ మిఠాయి తాత వచ్చాడు. తన కడుపు కొట్టవద్దని బతిమాలాడు. ఎంతకూ వెళ్ళకపోతే బంట్రోతు చేత బయటకు గెంటించాను. క్లాసుకు వెళ్ళి వచ్చాక చూస్తే సొమ్ము మాయమైంది. నాకు తెలుసు. ఆ ముసలాడే దీనికి కారణం. వెంటనే అరెస్టు చేయండి.'

ఉద్యోగంలోవున్న మనుష్యులు పరిస్థితుల ప్రభావాన్ని గుర్తించలేరు. వారనే మాటలు, చేసే పనులు ఆ క్షణంలో సమంజసంగా కనపడినా, మరుక్షణం అందులోవున్న నిజాన్ని శంకిస్తారు. హెడ్మాష్టారి మనస్థితి కూడా ఇంచు మించు అలాగే వుంది.

'మీరు చెప్పింది నిజమే కావచ్చు. కాని ఆ తాత తన స్వహస్తాలతో డబ్బు తీయటం మీరుకాని, మరెవరూకాని చూడలేదు. కనుక తొందరపడటం ఇసికలో బంగారం వెతకటం లాంటిదే. మీరు శాంతంగా వుండండి. నేను నిజానిజాలు తెలుసుకుంటాను. ఈ విషయం మాత్రం బయటకు రానివ్వకండి.'

ఆలోచిస్తూ బయటకొచ్చాను. ఓమారు క్లాసుకు వెళ్ళి పాపను చూడాలన్న కోరిక ఎందుకు కలిగిందో తెలియదు. కోరికలు జనించేందుకు ఒకప్పుడు స్పష్టమైన కారణాలు అవుసరం లేదు.

పాప ఎక్కడా కనపడలేదు. ఆ సంఖ్యాబలం మంది విద్యార్థుల మధ్య పాప చిన్నారిముఖం కనిపించక దాగివుందనుకోటం వాస్తవికతను వెక్కిరించటం. వేళకు బయలుదేరివచ్చింది. మధ్యలో మజిలీలు వేయవలసిన అవసరం లేదు. ఒకవేళ ఏదైనా మర్చిపోయి ఇంటికి తిరిగి వెడితే, ఆ వేళ్టికి బడి మానేయమని శారద శాసించిందేమో! బజారు మలుపు తిరిగేసరికి పాప కనపడింది. వెనుకపెంపగలు తింటూ ఓ ముసలాడితో కబుర్లు చెబుతూంది.

ఆ తాతను అదే మొదటిసారి చూడటం. అతని దుకాణం చిన్న కర్రపెట్టెలో సర్దుకుంది. పది పదిహేను సీసాలనిండా రకరకాల పిప్పరమెంట్లు, చాకలేట్లు, బతాణీలు—పెట్టెచుట్టూ సినిమాతారల బొమ్మలు. అతనన్నే చాకలేట్లు తియ్యగావున్నా, జీవితం మాత్రం విషాదంతో ముడివేసుకుంది. ముఖంలో అనంతమైన బాధ. నవ్వినప్పుడు మాత్రం, సముద్ర తరంగం ఉవ్వెత్తుగాలేచి పడినట్టు, ఆ బాధలు తాత్కాలికంగా అదృశ్యమయ్యేవి. చిరిగిన బట్టలు, చింపిరి తల మాసి మట్టితో చెలిమి చేస్తున్నాయి. పాప నన్ను గమనించలేదు కాని అతను మాత్రం భయంతో లేచి దండం పెట్టాడు.

'బాబయ్యా! ఏగో కడుపుకోసం—క్షమించండి. వెళ్ళిపోతాను' అన్నాడు. ఆ రెండు వేళకోసం ఆతని కళ్ళల్లో వృథాగా వెతికాను. దొంగను దొంగగా పట్టటం అంత కష్టతరమైంది కాదు. ఎంతగా అణచుకుందామనుకున్నా ఓ మూలనుండి నిజం ఎదురుపడింది. నిరాయకంగా వుంది అతని ముఖం.

పాప భయుకప్పున వెనక్కి తిరిగింది.

'నాన్నారూ!... మీరా?'

'పాపా! నువ్వు బడికి వెళ్ళకుండా ఇక్కడకెందు కొచ్చావ్?' అని గద్దించాను. భయం కళ్ళచుట్టూ గస్తీ తిరిగింది.

'నాన్నారూ! తాతయ్య కనిపించకపోతే నాకేం తోచదు. అందుకని బడికి

వెళ్ళకుండా ఇలా వచ్చాను. కనిపించాడు. పాపం! ఎవరూ ఏమీ కొనటంలేదట. ఏడు స్తున్నాడు. నాన్నారూ! ఓ కానీ ఇవ్వండి. అమ్మ నడిగితే చిరుతిళ్ళు తినకూడదని కసిరి కొట్టింది.'

ఆశ్చర్యపోయాను. తొమ్మిదేళ్ళ పాపకు ఈ హృదయం ఎక్కడనుండి వచ్చింది? ఆ ముసలాడి గుండెలో అయస్కాంతా లున్నాయేమో! పాపకు చిరుతిళ్ళంటే యిష్టంలేదు. కానీ ఎందు కడుగుతోందో నాకు తెలుసు. తాతకు ఏదో పెద్ద సాయంచేశానన్న తృప్తి కోసం. దూరం నుండి ఆలోచిస్తే అతను దొంగ. ఈ ఉదయమే స్కూలు సొమ్ము రెండువేలు తస్కరించాడు. పాప గొలుసుకు ఓ కన్ను అంకితం చేశాడు. దగ్గరగా పరిశీలిస్తే జాలి, కరుణ, అనురాగం, పశ్చాత్తాపం, విరక్తి అన్నీ కలిసి ఎదురౌతాయి.

'ఈయనే నా నాన్నగారు! ......'
'బాగుంది పాపా!' అన్నాడు వెకిలిగా నవ్వుతూ. ఛీ... ఛీ... కానీ ఖరీదు చెయ్యని ఓ ముసలాడితోనా అంతస్తు నేస్తం చేయటమా?

'ఇదిగో తాతా! ఇదంతా ఏం బాగా లేదు. నేను నీ సంగతి గమనిస్తూనేవున్నాను. రుజువుకోసం చూస్తున్నా. పాపతో నువ్వు మాట్లాడటం చూశానంటే తిన్నగా శ్రీకృష్ణ జన్మస్థానానికి పంపుతాను. జాగ్రత!' పదడుగులు నడిచాక వెనక్కి తిరిగిచూశాను. చెంపలవెంట కారిన కన్నీరు మాసిన గెడ్డంలో యింకి పోయింది.

* * * * *

ఆ సమస్య అలాగే వుండిపోయింది.

తరువాతి నెలరోజుల్లో తాతను రెండు మూడుసార్లు ఎక్కడో చూసినట్టు గుర్తు. అతను ఏదో పెద్ద ఎత్తుగడలో వున్నాడని శారద భయపడింది. అంతరాంతరాల్లో ఏదో మూగ బాధ వుంది. బహుశా పాపలాంటి మనవరాలు వుండివుండవచ్చు. ఉన్నట్టుండి ఆ చిన్నకళ్ళు మూతపడి అతనిలో మమకారానికి శాశ్వతంగా సమాధి కట్టివుండవచ్చు. ఇలా ఎన్నైనా ఆలోచించవచ్చు. ఇందులో ఏదో ఒకటి నిజంగా నిజమైనా, అది నిజంకాదనే భావన మాత్రం మనల్ని వదలదు. అలాంటప్పుడు ఈ ఊహ లెందుకో!

రాత్రి పది దాటింది -

శారద తొమ్మిదింటికే నిద్రపోయింది. ఆకాశంలో మబ్బులు ఒకదాన్నొకటి పరామర్శించుకుంటుంటే చిత్రం చూస్తూ పడుకున్నా- దూరంగా రైలు పరుగెడుతున్న చప్పుడు తప్పించి ప్రకృతి నిశ్శబ్దపు గర్భంలో దాక్కుంది. నా పక్కనుండి ఎవరో నడచి వెళ్ళినట్టయింది. కనుపాప చివరకు చేర్చి చూశాను. పాప అడుగుమీద అడుగు వేసుకుంటూ వెడుతోంది. వీధి తలుపు తెరుచుకుంది. ఆలసిస్తే ఏ అఘాయిత్యమైనా జరుగుతుంది. గట్టిగా అరచి వెనక్కి పిలుద్దామను

కున్నాను. కాని సమస్య శాశ్వతంగా పరిష్కారం కాదు. పాపను వెంబడించాను.

పాపకాళ్ళు త్వరగా పరుగెత్తాయి. చల్లగాలి- చీకటి- చెట్ల స్వీయగాథలు- అన్నీ వెనక్కి జరిగాయి. చిన్న సందుగుండా నడిచింది. దూరంగా కుక్కలు మొరిగాయి. ఆమెను పసికట్టికాదు. ఏమీ పని లేక 'ఏదో అవుతోంద'న్న భ్రమతో. పది నిమిషాలలో ఓ గుడిసెముందు ఆగింది. దుర్గంధం ముక్కు పుటాల్ని కాలిచివేసింది. ధైర్యంగా తలుపు తీసుకుని లోపలకు వెళ్ళింది. కిటికీ దగ్గరగా నిలబడి లోపలికి తొంగిచూశాను.

ఆ తాతే! అతని ఇల్లు ఇదేకావచ్చు. అర్ధరాత్రి జీవితంలో 'అర్థ'లు తెలియని చిన్న పిల్ల అతన్ని వెదుక్కుంటూ వచ్చిందంటే ఆశ్చర్యంగా వుంది. తాత మంచం మీద పడుకుని మూలుగుతున్నాడు. పాతకాలానికి కృంగిపోతున్న మంచం- చుట్టూ చిన్న చిన్న సీమవెండి గిన్నెలు- ఓదాంట్లో గంజి గామోలు- చిన్న రేకుల పెట్టె, తల కెదురుగా దుకాణం, అందులో మిఠాయుండలు, చేగోడీలు, ఐస్‌క్రీం, పిప్పెరమెంట్లు- అన్నీ పాలిపోయి జీర్ణ దశలో వున్నాయి. తాత పాప రావటం గుర్తించలేదు. కళ్ళు సగం సగం మూతపడి వున్నాయి. రెండుసార్లు పక్కనేవున్న నీళ్ళముంత అందుకోటానికి యత్నించాడు. చేతి నరాలు సత్యాగ్రహం చేశాయి.

'తాతయ్యా! నే సందిస్తాను' అంటూ పాప ముంత అందుకుంది.

'పాపా! నువ్వా? అయ్యయ్యో! ఎందుకీ అర్ధరాత్రి వచ్చావ్? మీ నాన్నగారికి తెలిస్తే ఏమవుతుంది? అదలావుంచి ఇంటి దగ్గర కనిపించకపోతే ఆయన అంతటా వెదుకుతాడు. వెళ్ళిపో!'

'తాతయ్యా! నాన్నారు ఏమన్నా సరే! వెళ్ళను. నువ్వు నాలుగురోజులుగా కనబడటం లేదు. రోజూ వద్దామనే అనుకునేదాన్ని. కాని నాన్నారు నా వెంట ఎప్పుడూ వుండేవారు. అందుకే అందరూ నిద్రపోయాక వచ్చేశాను. నీకు జ్వరమా తాతయ్యా? డాక్టరు మందివ్వటం లేదూ? ఓమారు డాక్టరు పెద్ద సూది పొడిచారు. ఏడుస్తున్నావా? ... ఛీ... ఛీ... నీకు పట్టి మందుమాత్రిం ఇమ్మంటానులే.

'వద్దమ్మా! నేనిలాగే చచ్చిపోతాను. తాతను మాత్రిం మర్చిపోకు. డాక్టర్ని ఎలా తీసుకురాగలను తల్లీ! పది రూపాయలు తెమ్మంటాడు. నా దుకాణం అమ్మేస్తాను. పది రూపాయలిచ్చి కొనుక్కో' అనేసి నవ్వాడు.

'తాతయ్యా! నీకెవరూ లేరు? పాపం, ఒంటరిగా వున్నావ్?'

'నువ్వు లేవూ! నా కంటిపాపవి.'

ఆ తరువాత ఏవేవో పిచ్చికబుర్లు. ఇద్దరూ చిన్నపిల్లలు. అభిప్రాయ భేదాలు,

సంఘర్షణలు వుండవు. వానకురిసి వెలిసిన ఆకాశంలా, తెల్లని మల్లెపువ్వుల్లా స్వచ్ఛమైన మనసులు.

* * * * *

ఆ మర్నాడుదయం కోటు జేబులో వున్న పదిరూపాయలు మాయమయ్యాయి. పాపను పిలిచి అడిగాను– బెదిరించాను. 'అవు' ననదు. 'కాద'నదు. అలా వెర్రిదానిలా చూస్తూ నిలబడుతుంది. ఆ డబ్బు ఎక్కడకు చేరుకుంది నాకు తెలుసు. పాపను దండించి పస్తోపవాసం వుంచేదు.

* * * * *

మరో నాలుగురోజుల్లో అనుకున్నంత అయింది. పాప మెళ్ళో గొలుసు అదృశ్యమైంది. ఆ ఉదయం తలంటుకునేముందు తీసి టేబిలుమీద వుంచిందట.

'ఆతరువాత నేను చూడనేలేదు.' అంది సాయంత్రం. ఎందుకో ఆ మాటల్ని ఎవరమూ నమ్మలేకపోయాం. ఆ ముసిలాడు తన అభిమతం నెరవేర్చుకున్నాడన్న మాట. రెండుకాసుల బంగారం. ముచ్చటగా పుట్టిన రోజు పండగనాడు చేసిచ్చాం. ఉద్రేకంతో, కోపంతో మనసు కుతకుతలాడింది. ఇక ఎవర్నీ క్షమించేది లేదు.

'పాపా!' నిజం చెప్పు. నీ చిన్నమనసు బాధపడుతుందని ఇంతకాలంగా వూరుకున్నాం. నువ్వంటే వాడికి నిజంగా ప్రేమేమో ననుకున్నా. మోసం తెలిసింది. నువ్వే ఇచ్చావా? లేక వాడు లాక్కున్నాడా? ఉన్నదున్నట్టు చెప్పెయ్' అని గద్దించాను.

'నాన్నారూ! ఈ పొద్దుట్నుంచి నేనసలు గొలుసు చూడనే లేదు. ఏమైందో తెలియదు.' అంది ఏడుస్తూ. పాపం ఎన్నడూ అబద్ధం ఆడదు. ఆ నాడు పది రూపాయల్ని గురించి అడిగినప్పుడు మౌనంగా వూరుకుంది. చీకట్లో చెట్ల నీడలు దెయ్యాల్లా కనిపించినట్టు అనుమానం ఆవహించింది.

తిన్నగా ముసలాడి గుడిసె చేరుకున్నాను. పోలీసు ఉద్యోగుల్ని చూడగానే అతను గడగడ వణికాడు. వివరాలు అడిగాను. తనకేం తెలియదని భోరుమన్నాడు. దొంగ తను దొంగని ఎన్నడూ ఒప్పుకోడు. అతనిలో మంచితనానికి స్థానం లేదు, గదంతా సోదాచేస్తే ఓమూల చింకిచాపకింద గొలుసు దొరికింది.

'బాబూ! నాకేం తెలియదు. నన్నెవరో మోసగించారు. నన్నేం చేయకండి. నేనేమీ ఎరుగని బీదవాణ్ణి.' చేతులకు బేడీలు వేశారు.

మరోగంట గడిచాక మా ఇంటి పని మనిషి పరుగెత్తుకొచ్చింది. నన్ను చూడగానే కాళ్ళమీదపడి భోరుమని ఏడవసాగింది.

'బాబయ్యా! పాపిష్టి ముండను. కొండంత నేరం మూటకట్టుకున్నా. నన్నురి తీయండి!'

'అసలు ఏం జరిగిందో చెప్పు' అన్నాను.

'ఆ ముసిలాడు అమ్మాయి గారి గొలుసు తీయలేదండి. ఆడు ఒట్టి వెర్రిబాగు లాడు. ఏం ఎరగడు. చేసింది నేను. చివరి కిలా అవుతుందనుకోలేదు.' ఏడుపు మధ్య మధ్య ఆపి జరిగిన నిజం చెప్పింది.

పాప గొలుసు పొద్దున్న టేబిలుమీద చూసింది. ఆశ లేచింది. ఆత్మ మనసుకు భయపడి ఎక్కడో దాక్కుంది. అవకాశం ప్రోత్సాహపరుస్తూ నవ్వింది. కాని ఆమెను అనుమానిస్తారని, గుడిసె సోదా చేస్తారని తెలుసు. పక్కింటి తాత గుడిసెలో దాచేసింది. తాతను మొదట్నించీ నేను అనుమానిస్తున్నానన్న విషయం ఆమెకు తెలియదు.

తన కేమీ తెలియదని భయంతో ఆక్రోశించిన అతని ఎండిన ముఖం కొట్టొచ్చినట్టు కనపడింది. అతని కన్నీటి నదై, మహానదై, సముద్రమై నన్ను ముంచివేసింది. గబ గబ పరుగెత్తాను— స్టేషనునుంచి విడుదల చేద్దామని. సర్వం అయిన నిమిషాల క్రితం అతను గుండెఆగి చనిపోయాడు. అందుకు కారణం అంతుచిక్కని రోగం— జీవితం మీద నిరాశ— అనురాగం అందివ్వని విషపాత్ర— ఇవేమీ కావు. పోస్టుమార్టం జరిగాక "అతను ఫలానా రోగం వలన చనిపోయాడు." అంటాడు డాక్టరు. మనసు తెగి యని ఏదో పొరుగువారికి రోగంపేరు. కాని దానికి నిజంలేదు. అతన్ని చంపింది నేను.

" చనిపోతూ ఏమన్నాడు ? " అనడిగాను—

"ఇంటో చిన్న పెట్టెవుంది. అది తెరచి మిమ్మల్ని సోదా చేయమన్నాడు." బరువైన గుండెతో వెళ్ళి ఆపెట్టె తెరిచాను. ముందుగా కనపడింది నా చిన్ననాటి ఫోటో!... కళ్ళు తిరిగాయి. ఆ పక్కనే నా పేర ఏదో ఉత్తరం— తీసి చదివాను. చాలాసేపటివరకు అక్షరాలు అలుక్కుపోయినట్టు కనిపించాయి.

"నాయనా! ఈ ఉత్తరం నీ చేతికందే సరికి నేను జీవించివుండను. నేను బతికుండగా ఈ రహస్యం నీకు తెలియకూడదనే దాచి వుంచాను. మీ నాన్నను గురించి నువ్వెప్పుడైనా ఆలోచించావా?... నా వెర్రిగాని ఆలోచించేందుకు అవకాశం, అవసరం లేవు. ఎందుకంటే నీ చిన్నతనంలో— అంటే నీకు నాలుగేళ్ళున్నప్పుడే మీ నాన్న నీకు దూరమయ్యాడు. అందరూ అతను చనిపోయాడని చెప్పుంటారు— అది నిజంకాదు. మీ నాన్న బతికేవున్నాడు. ఇప్పుడుకాదు— నిన్నటి వరకు.

రంగూన్‌లో బాంబులు పడగానే అందరూ పరుగెత్తారు. ఆ బీభత్సంలో బంధువులు, డబ్బు ఏవీ జ్ఞాపకానికి రాలేదు. నిన్ను మీ మావయ్య తీసుకుని అడ్డగోడ్డంట పరుగెత్తాడు. మీ నాన్న మరోదారి వెతుక్కుంటూ కష్టాలు అనుభవించి ఎలాగో భారత దేశం చేరుకున్నాడు, నీ కోసం వెతికాడు.

అందర్నీ అడిగిచూశాడు. అందరూ భయంతో ఒకర్నొకరు చూసుకున్నారు. సమాధానం ఇవ్వలేదు. నువ్వు అగ్నిజ్వాలలకు ఆహుత య్యావని మనసు విరిగి తిరిగి రంగూన్ చేరు కున్నాడు. పరిస్థితులు శాంతించినా అతని జీవితం తుఫానులో వుండిపోయింది. తిరిగి వ్యాపారం మొదలుపెట్టినా, మనశ్శాంతి లేక అభివృద్ధికి దూరంగా వుండిపోయింది. నువ్వు ఏనాడైనా కనిపిస్తావన్న ఆశతో అలా జీవిస్తూ వచ్చాడు.

క్రమంగా ఆరోగ్యం, ఐశ్వర్యం అన్నీ నశించాయి. అతను ముసిలాడై పోయాడు. చివరకు నిన్ను వెతుక్కుంటూ మళ్ళీ భారత దేశం వచ్చాడు. ఊళ్ళూరా తిరిగి చివరకు నిన్ను కనుక్కున్నాడు. కాని నువ్వతన్ని గుర్తుపట్టలేదు. అది నీతప్పుకాదు. నువ్వంటే, పాపంటే జాలిగా చూస్తూ, పొంగివస్తున్న బాధను అణచుకుంటూ అలా బతికాడు. అతను చివరిసారిగా కోరుకున్నది మిమ్మల్ని అక్కడో ఇక్కడో చూస్తూ తృప్తిపడటం. అంతే–

అయితే తనే నీ నాన్ననని ఎందుకు చెప్పలేదని అడుగుతావేమో! అతని జీవితం దుర్భరమైంది. కష్టాలకూ అతనికీ కలకాల స్నేహితం. ఓ మిఠాయి యతను నీ నాన్నని చెప్పుకునేందుకు సిగ్గుపడి వూరుకున్నాడు. అతన్ని మర్చిపోకు."

"నాన్నా!" అని గట్టిగా అరిచాను.

తల తిరిగింది. ఎలాగో తమాయించు కుని ఇల్లు చేరాను, శారద కంగారు పడింది. పాప భయంతో వణకింది. ఎవరికీ ఏమీ చెప్పే స్థితిలో లేను. ఏ దశలో, ఏ పరిస్థి తుల్లో వున్నా నాన్న కే మొదటిమెట్టు. ఆ సంగతి నాన్న గ్రహించలేదు. ఇప్పుడు నాకు తెలిసింది. పాపకోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూడటం– నన్ను చూడ గానే కంట తడిపెట్టటం. నీటి వెనక దాగి వున్న మహాశక్తి నా కిప్పుడే అర్థమైంది. ఈ భావాలకు, ఉద్రేకాలకు అంతంటూవుండదు.

కళ్ళమ్మట నీటి ధారలు కారుతూ వున్నాయి. పెరిగా పాపను కావలించు కుని "మిఠాయి తాత"ను మనసులో పదిల పర్చుకోటానికి యత్నించాను.

# శిల్పాత్మ

విశ్వనాథ వేంకటేశ్వర్లు.

నీవెవ్వరైన నెఱుంగనేరముగదే నిర్వ్యాజ వైరాగ్య వి
ద్యాపారమ్య మహేశ్వరుండవు మహాంధ్రాత్మా గిరి ప్రోద్భవ
శ్రీపీయూష తరంగ సుందర కలా శ్రీయో విచిన్వాత్మసుధీ
వ్యాపారుండవు రూప గాంగజల నిత్యస్నాత శీర్షుండవున్.

నీ వెవ్వరోయి శిల్పీ !
కేవల మృత్యుంజయత్వ కీర్తి బరగుచున్
మావలను కాలవుందెర
చే వెల్చుచు జూతు కరుణ చిలికెడు దృష్టిన్.

రాజులు రాజ్యముల్ సమయు రాక్షసు డెత్తుకుపోవ, బోయినన్
దేజ [illegible]రంగ, ప్రజ్వల మతిప్రతిభన్ నవ సుందరాత్మ శో
భాజిత కాలవేగుడ వభంగురతా రమణీయ రూప లీ
లా జయ సృష్టివైభవ కలా చతురాననమూర్తి వెంతయున్.

శాతవాహన మహా జ్యోతిస్సు గగన భూ
పథుల దీర్చిన రంగవల్లికలును
చాళుక్యవంశ వైశ్వానరార్చులు దిద్ది
గంతమ్ములన్ గ్రుమ్మ నమృత కళలు
కాకతి కనుదోయి కలువ రేకులు విచ్చి
దిశల నిండించిన తేనెవాక
కృష్ణరాయల బాహు కేయూరమణి ఘృణుల్
విశ్వంబు నించిన వింత వెలుగు
తెలుగు రాజుల ఖడ్గ పుత్రికల మేలి
నృత్య రేఖలు త్వన్మనో నిశిత టంక
ధారలో వెల్గు జీవ పదార్థమునకు
బరగు నిత్య తేజోమయోపాధులయ్యె.

నటరాజునై ధాన్య కటక వాటికలోన
శిల్ప విద్యా తపస్సిద్ధి వడసి
అల అజంతాగుహా భ్యంతరోత్థిత శిల్ప
సర్వ రసాపగన్ జడ ధరించి
ప్రోలుని పురి శిల్ప శైలజన్ వేయి కం
బాలాట వేరీతి మరులు కొలిపి
విజయ వాటిక శిల్ప వృషభు నెక్కి శిలాళి
అమరాళితోడ వయ్యాళి పోయి

ఆంధ్ర దేశస్థ దేవతాయతనములను
చిత్రకళార్చాంత సత్కళల శిల్పరూప
శివ రసావేశ తాదాత్మ్య సిద్ధినొంది
చిలికి తమృతమ్ము నాంధ్ర ధీ క్షేత్రములను.

అలయు విభావమై యభవ డంబెకయున్ రసరాజ్య సృష్టికన్
నెలవులు గాగ, బ్రహ్మపద నిత్యభవత్కళలత్వ బుద్ధి దె
ల్లగ తెలిమి చర్వ్యమాణ రసలోలత స్థాయులు తొమ్మిదింటి కా
తలిదగు కేవలానుభవ ధామము నొందిరి చిద్రసాకృతిన్.

శివుడు నృత్తము జూప చిజ్ఞానోన్మేళనా
వ్యాకృతంబగు లయవ్యాప్తి జూపి
శివుడు నృత్యముసేయ భువన పదార్థ వి
వేచన ప్రౌఢిమ విందుగొలిపి
శివుడు నాట్యముచేయ చిద్రసైక సువస్తు
పూర్ణతా వాక్యార్థబోధ సలిపి
శివలాస్య తాండవ శ్రీ భేదముల సృష్టి
సంహృతి క్రీడా ప్రశస్తి జూపి

శివుని రసమూర్తియు త్రిలింగ భువన కీర్తి
వ్యంజక వ్యంగ్యభావ సంవాద మొలయ
నాంధ్రుల హృదంతరంపు రసార్ద్ర వృత్తి
శివ మహాభూతి జేసితి శిల్పసిద్ధి.

శిలా పాధిక ద్రవ్యమై, యులులు గ్రసేయుంగ నీ దివ్య హ
స్త లసత్ స్పర్శము స్పర్శవేది గుణ బోధంజేసి లోకత్రయో
జ్వల హైరణ్మయ రూపసంపద వెలార్పన్ సృష్టి సౌందర్య రే
ఖలు సృచ్చైత్రము. ద్వన్మనః కమల సౌగంధ్యం బదేలాటిదో !

ఏరాయి గిరీశుడో యేక శైలజయూనా
ప్రమథులయ్యెను శిలా ప్రతిమలెవియు
తాలు తాలను గల్గు రమణీయ దేవతా
కృతి జూను జేసి కన్నెసక మెసగ
నాంధ్రరాజుల మూర్తి నభినవోజ్వల శైవ
రూపసంపద మనోరూఢి దెలిసి
కాలు కన్నెజగించి కాలాధికారా
నానంత్య సంస్థితి నందజేసి
శివము సత్యమ్మనె వస్తుసిద్ధియందు
సుందరాత్మత గూర్చి తానందతుంగ
శేంను ధన నాళ కోటీన హార కలిక
నాట్య రసఘని పృథ్విపై నాట్యమాడ.

# నేటి కవిత - సంప్రదాయము

సుప్రసన్న.

ఈ దశాబ్దములోని తెలుగు కవిత ప్రధానముగా వివేకశీలమైన భావనామార్గమునకు చెందినదిగా ఒకచోట నిర్వచింపబడినది. ఈ వివేచనా శీలము సర్వ కవిత్వమునందును ప్రాధాన్యము వహింపకపోయినను, అంతర్ధాతువుగా సర్వత్రా వ్యాప్తముగా కానిపించుచున్నది. పత్రికలలో ప్రచురింపబడు ఖండిక నుండి మహాకావ్యేతిహాసము వరకు ఈనాటి కవుల పరిశీలక లక్షణ మభివ్యక్త మగుచునే యున్నది. కొందర కవిత్వమునం దిది వాచ్యమగుచున్నదా యన్నంత చిత్రముగా నున్నది.

ఈ వివేచనము ప్రధానముగా ఆంతరమైనది. మనస్సంబంధమైనది. మనస్సంబంధములైన వాసనలు, అనుభూతులు మొదలైనవానిని విశ్లేషించి వాని కాధునికమైన వ్యాఖ్యానము చేయుట దీనియందు ప్రధానముగా కానిపించుచున్నది. ఇది ఆధునికమైన మనస్తత్వశాస్త్రము చదువుకొనుటవలన కలిగినది. మన పూర్వ కావ్యములలో పాత్రలయొక్క ప్రవృత్తిని సక్రమముగా తీర్చుటలోనే వారి మనః ప్రవృత్తియొక్క వైలక్షణ్యము తెలియుట మనకు తెలియును. కాని అది కథలోనే అంతర్భాగమైపోయి పాత్రగతమై యుండెడిది. భారతమునందు తిక్కన్నగారు పాత్రలను తీర్చిన తీర్పిట్టిదే. ఆయన పాత్రలయొక్క ప్రవృత్తి అచ్చముగా వాని వాని విలక్షణమైన మనోవృత్తి చెదరకుండ సాగును. అంతకన్నను ఈనాటి కవులు వానిని విడదీసి ఆ స్థితి మాత్రమే వర్ణించి దాని లక్షణము చెప్పుచున్నారు. ఇవన్నియు ఖండికలలో తీర్పబడినప్పుడా మనోవృత్తి కొట్టవచ్చినట్లు కానిపించుచున్నది. ఒక అహంకారముయొక్క స్వరూపము, ఒక మహాపురుషుని సందర్శనము చేయునప్పటి ఆనందముయొక్క స్వరూపము, ఒక విలక్షణమైన దివ్యానుభూతి, ఈ విధముగా వైయక్తికములైన అనుభూతులను వ్యాఖ్యానించుట కొందరు చేసిరి. మనస్తత్వశాస్త్రము మనకీపని చేసినది.

ఈ మనస్సును విశ్లేషించుట కారణముగా మనుష్యు లందరిలోనను సుఖము, దుఃఖము వాని వలన కలుగు అనుభూతులు సామాన్యములని తేలినది. ఈ సుఖమే పరమార్థముకానట్లు కొందరీ రెంటిని మించిన ఆనందమును చెప్పిరి. సుఖ దుఃఖముల స్వరూపము వాని అనుభోక్తలోని ఆశా- నిరాశలు ఇవి నిరూపించిరి. శాస్త్రజ్ఞులకు మృత్యు నిరాకరణ మెంత ప్రధానమైనదో, అట్లే కవులకు దుఃఖ నిరాకరణము ప్రధానమైనది.

ఈ స్థితి తెలుగు కవిత్వము మరల సంప్రదాయమార్గమును పొందుటకు కారణమైనది.

ఈ సంప్రదాయమన్నమాట చిత్రమైనది. ఈ మాట యనగనే చాలమంది వేదకాలమునాటి సాంఘిక పరిస్థితులను మరల తెచ్చు ప్రయత్నముగా వ్యాఖ్యానించుచున్నారు. ఇది వర్ణాశ్రమ ధర్మములకు వ్యతిరేకమైన ఆధునిక సమాజమును మరల వెనుకకు తీసుకొనిపోవు ప్రయత్నమని, బ్రాహ్మణాధిక్యము, సంస్కృత భాషాధిక్యము, ఒక అల్ప సంఖ్యాక వర్గము అధికులను పీడించుకొనుట, నిరంకుశత్వము ఇవన్నియు సంప్రదాయమను పేర చెప్పబడుచున్నవి.

నశించిపోయిన వానికై దుఃఖించుట, వాని కోసము వ్యర్థముగా ప్రాకులాడుట సంప్రదాయ మనిపించుకొనదు. ఏవో కొన్ని ఆచారములు పలుకుబడులు, ఇవే సంప్రదాయ మనలేము. కొన్ని పూర్వగాథలను మాత్రమే మరల మరల పారాయణము చేయుటయును కాదు.

ఇది జాతియొక్క లక్షణము. జాతియొక్క చరిత్ర సంస్కృతి యే యే ప్రధాన ధర్మముల నాశ్రయించి వర్తించినవో ఆ యా ధర్మముల పునర్జాగరణ మొనర్చుటయే సంప్రదాయము. ఇది పరంపరలుగా మార్పులు పొందుచుండదు. సర్వకాలములయందు దీని కప్రతిహతత్వమే. ఈ మూలభూతమైన ధర్మమే సంప్రదాయము. ఇచ్చట మరియొక విషయము. ఈ సంప్రదాయము పూర్వపూర్వములైన విషయములను వ్యాఖ్యానము చేయుటతో ఆగిపోదు. ఆధునిక మనశ్శాస్త్రమే కాక, మానవ పరిణామము, సృష్టివికాసము, విజ్ఞానశాస్త్రములోని పరిశోధనలుకూడ దీనియందు వ్యంజకములుగా గోచరింపజేయుటకు ప్రయత్నము చేయబడుచున్నది. కొందరు కవులలో నీ విజ్ఞానశాస్త్రమందలి మోహ మెంత పెరిగినదనగా, వారు సంప్రదాయ మార్గమును దానిలో కలుపుకొనలేకున్నారు. ఈ పరిశోధనలు, ప్రాచీన ఋషి సూక్తములు ఒకే సత్యమును చెప్పచూచుచున్నవి. సర్వ విశ్వమును శక్తియొక్క స్వరూపముగా శాస్త్రము ఋజువు చేసినది. అణువులయందు నొక క్రమమున చరించెడు శక్తులకు మార్పుకలుగుట వలన అనంతమైన శక్తి ప్రాదుర్భవించుచున్నది. ఈ శక్తినే ఋషులు అనేక దేవతా రూపములలో వర్ణించిరి. పురాణ గాథలకు శాస్త్ర సమన్వయము చేయబడుట యొక మహాశ్చర్యజనకముగా సాగిపోవుచున్న విషయము. వసుధైక భావనా మార్గము, శాంతిసాధనము అన్న పథముకూడ ఒకవైపు పలుచపలుచగా సాగుచున్నది. ఇందు యుద్ధ విరోధము, శాంతికామన, నైతిక జీవనోన్నతి ప్రధానములు.

ఇది పలాయనవాదము కాదు. నేటి సాంఘిక పరిస్థితులకు జడిసి ఈ సమాజములో నిలువలేక వెరచి దీనినుండి పారిపోవుటకాదు. ఏతన్మార్గము పరంపరాశ్రితమైన ప్రవృత్తి కలది. ఒక యెడ తెగని వాగువంటిది. పునాదివంటిది. పైపై మెఱుపులకు భ్రమసి, తాత్కాలికమైన లాభములను కోరి ఈ సంప్రదాయమును పరిత్యజించుట తగదు. ఈ త్రోవను వీడిన రచనలో జీవముండదు. అనగా రచనకు జీవభూతమైన రసముండదని యర్థము.

భారతీయ కవులకు మూలభూతమైన ఈ ధర్మము లేవన్నచో అవి మూడు: విశ్వశ్రేయము, లౌకికానందము, బ్రహ్మానందము. ఈ మూటినే ధర్మార్థ కామ మోక్షములుగా పూర్వము చెప్పిరి. ఈ లౌకికానందమన్న దానియందే అర్థకామములు చేరును. ఇందు రసానందమును ఊర్ధ్వాగ్రము. ఈ మూడు లక్ష్యములే వీరి సర్వరచనలకు ఆధారములైనవి. ఈ మూటియందును ఉత్తరోత్తరము బలీయములైనవి. కావ్యమన్న కర్పూరము, రస పరీమళము కలదై, బ్రహ్మ విద్యాసాధనలో జ్వలించి పోవలయును. ఈ వెలుగు నాశనము కాదు. దీని వెలుగు సార్వకాలికము. ఈ లక్ష్యములే వ్యాస వాల్మీకులు, కాళిదాస భవభూతులు, కవిత్రయము, పోతన, పెద్దనలు, సంస్కృతాంధ్రములలోని మహాకవులు రచించిరి. ఆ త్రోవ సంప్రదాయ మార్గము.

ఆత్మాశ్రయ రచన, గీతికావ్య రచన ఖండ ఖండములుగా నలువదేండ్లు సాగినది. దానియందలి వ్యామోహము తగ్గినది. వస్తుబలములేని రచనలు కేవలము వైయక్తికములైన భావములు అవియు చాలవరకస్పష్టములు— ఎంతకాలము నిలచును. ఈ భావములయందు వాని ప్రచురించు భాషయందు

కూడ విజాతీయములగును. ఇవన్ని యెట్లున్నను వీని వలన కలుగునది కేవలము మానసమున నొక చమత్కారమైన భావస్పర్శ. దానిని చర్వణము చేసుకొనుటకు కూడ సాధ్యమయినది కాదేమో. ఈ తరమైన రచన వెనుకబట్టినది. అనగా ఖండికల రచన ఆగిపోయినదని కాదు. కాని ఖండికలతో పాటు కావ్యముల రచన కూడ సాగుచున్న దనుట ప్రధానమైన విషయము.

కేవలము కావ్య రచనయే సంప్రదాయమగునా ? యన్నచో అట్లుకాదు. ఈ కావ్యము రసాభిముఖముగా నిర్వహింపబడవలయును. కొన్ని కొన్ని కావ్యములు రామాయణ మహాభారతములలోని కొన్ని కొన్ని సంఘటనలు స్వీకరించి పెంచి వ్రాయబడినవి. వానియందా పాత్రను క్రొత్తగా తీర్చుట మాత్ర మైనది. కాని అది సంపూర్ణముగా కావ్య స్వరూపమును పొందలేదు. ఈ కావ్య ఖండములందు పాత్రలయొక్క సంపూర్ణ వికాసము కలుగలేదు. ఒక కర్ణుని దానము, ఒక బుద్ధుని కరుణ, ఒక రాముని దుఃఖము, ఒక ద్రౌపది రోషము ఈ మార్గమున వ్యాఖ్యానింపబడినవి. ఈ ఖండములు ఆత్మాశ్రయ కావ్యములలోని అయోమయ లక్షణమును వదిలించుకొనుటలో వారికన్న నొక ముందంజ వేసినవి. ఈ ప్రాచీన గాథాస్వీకరణము నందును కవుల వ్యక్తిత్వమునకు లోపము వచ్చుట లేదు. వీనియందు కథయొక్క ప్రాధాన్యములేదు. కథ యొక శరీరము మాత్రమే. వీనియందు ప్రాణభూతమైన పదార్థము జీవితములోని యేవియో యొక భావములయొక్క సంఘర్షణ. లేనిచో ఈ జీవుని ఆత్మసాధనకు చెందిన ఒక విలక్షణమైన సంప్రదాయము నతిక్రమించని వ్యాఖ్యానము. ఈ యెడల కవులు తమ తమ లోతుల ననుసరించి యోగశాస్త్రము, విజ్ఞాన శాస్త్రము, మనస్తత్వ శాస్త్రముల సహాయము తీసుకొనుచున్నారు.

ఈ విధముగా కావ్యలోకమునందు వచ్చిన మార్పు, సంప్రదాయమునకు మరలుట యన్నది ఆంతరములు బాహిరములైన అనేక శక్తుల ప్రేరణమున సంభవించినది. శ్రీ అరవిందులు, రమణ మహర్షి, రామకృష్ణుడు మొదలైనవారు ఈ పునరుజ్జీవన భావనమునకు మూలస్థానీయులు. శ్రీ అరవిందుల దివ్యజీవన పరిణామ సిద్ధాంతము భారతీయ సాహిత్యమునే ప్రభావితము చేసినది. ఈ సర్వ సృష్టి జడ, ప్రాణ, మనో విజ్ఞాన దశలలో పరిణతమగుచున్నది. ఇప్పుడు మానవుడు మనోదశలో నున్నాడు. ఈ మానవుడు క్రమాభివృద్ధి నందుచో విజ్ఞానదశ చేరుకొనగలడు. ఈ విజ్ఞానము సర్వ సంపూర్ణమైనది. భౌతికమైన జ్ఞానము నతిక్రమించినది. ఈ స్థితియందు మానవుడు దివ్యమానవు డగుచున్నాడు. ఈ లోకమును వదలి యేదో లోకమును పొందవలయునని కాక ఈ లోకమునే దివ్యముగా మార్చివేయవచ్చునని శ్రీ అరవిందుల నమ్మకము.

శ్రీ అరవిందుల దివ్యజీవన పరిణామ సిద్ధాంతము కావ్యలోకమున కూడ తన ప్రాభవమును నెరపినది. కవులు ఈ లోకములోని బాధ, దుఃఖము, నిరాశ ఇత్యాదులనుండి విముక్తి యెట్లా యని విచారించి వారీలోకమును విడచిపోయి వేరే స్వప్న లోకములో నుండవలచురు కాని ఈ దుఃఖమయ జీవిత లోకమే ఒక స్వర్గ ఖండముగా మార్చవచ్చునన్న ఆశ, ఈ సంకుచిత మనః పరిధులలో నిరాశా నిస్పృహలలో కొట్టుకొనిపోవు మానవుడే దివ్యుడైన మానవుడు కాగలడన్న నమ్మకము సాహిత్య లోకమున కలిగినది.

శ్రీ అరవిందుని దృష్టితో ననేక సాహిత్య సృష్టికూడ నొనర్చిరి. వారి యనేక కావ్యములు, నాటకములు, భవిష్యత్కవితయన్న గ్రంథము ఈ మార్గమునే సూచించినవి. 'సావిత్రి' యన్న వారి

కావ్యేతి హాసము ప్రచురించబడినది. ఈ కావ్యేతి హాసములో వస్తువు మహాభారతములోనిదే. కాని శ్రీ అరవిందులు విజ్ఞానమయుడైన పురుషుని ఆవిర్భావము, దివ్యజీవనము అన్నవానిని ఈ మహా కావ్యముద్వారా ప్రతిపాదించినారు.

శ్రీ అరవిందుల ప్రేరణ భారతీయ సాహిత్యమునకు చాల ప్రధానమైనది. ఇంత ప్రత్యక్షముగా కాకపోయినను పరోక్షముగా సాహిత్యమున ప్రభావము నెఱపినవారు రమణమహర్షి, రామకృష్ణులును. ఆధునిక కాలమునకు చెందిన ఈ ఋషులు సర్వ మతములయందలి సత్యమును ఉద్ఘాటించినారు. సర్వమానవులు పరస్పర స్నేహములో జీవింపవలయునని వీరు ప్రతిపాదించిరి. జగత్తులో ఒక మతము, జాతి, సంప్రదాయము అధికము కాదనియు యేమార్గమువారు దాని ననుసరించి ముక్తిని పొందవచ్చుననియు వీరు చెప్పిరి. ఈ సౌహార్ద్ర భావము సాగినదీ మార్గముననే.

వసుధైక కుటుంబము, విశ్వమానవ సౌహార్ద్రమన్న భావములు ఈ ప్రవక్తల వలన మరల మరల ఉన్మేషము పొందినవి. ఈ విధముగా భారతీయుల సంప్రదాయ మార్గము పునః ప్రతిష్ఠితమైనది. దీని యందలి ప్రధానమైన విశ్వ శ్రేయమన్న ధర్మము, ఆధ్యాత్మ భావనము ఈ ప్రవక్తల వలన సిద్ధించినవి. మూల భూతములైన ధర్మములకు వీని వలన ప్రతిష్ఠ కలిగినది.

ఈ ఆధ్యాత్మిక ప్రవృత్తి ఈ తరము కవులలో ప్రధానముగా కానవచ్చుచున్నది. ఈ విధమైన భావనయొక్క పర్యవసాన మొక్కొక్క కవిలో నొక్కొక్క విధముగా నుండవచ్చును. ఆరుద్ర రచించిన 'కాలము', అన్న రచన దానికొక ఉదాహరణముగా కైకొనవచ్చును. కాల స్వరూపమును గూర్చిన జిజ్ఞాస ఆయన చేసినాడీనిలో. శ్రీ శ్రీ 'సదసత్సంశయము' అన్న రచన కూడ చాల ప్రధానమైనది. ఈయన అభ్యుదయ కవితా మార్గ ప్రవక్త అయ్యు ఈ కాలమున రచించిన ప్రముఖ రచన యిది. సంపూర్ణము కాకపోయినను దీనియం దీయన ఆలోచనామార్గము కూడ కేవల భౌతికమునుండి మారిపోయినట్లు, ఆధ్యాత్మిక మార్గమున ఆలోచనలు రేగినట్లును నిదర్శన మగుచున్నది.

ఈ విధముగా సాగుచున్న ఈ కవితా మార్గమునకు అధినేతగా నిలచినవాడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. భావకవుల నాటినుంచి ఈయన రచన సాగించుచున్నను నాటినుండియు వారికన్న విలక్షణముగా ఈయన తన రచనలు చేసినాడు. ఈయన ఏ రచన చేసినను సర్వమును భారతీయ ధర్మము, సంప్రదాయము వీని యాధారముగా నుండును. భావ కవులవలె ప్రణయ గీతములు వ్రాసినను ఈయన గిరికుమారుని ప్రేమగీతములు కుల పాలికా ప్రణయమునకు ప్రతిపాదకములైనవి.

ఈయన సృష్టి అనేకమైనది. విలక్షణమైనది. ఉజ్జ్వలమైనది. ఆయన శ్రీమద్రామాయణ కల్పవృక్షము వెలువడుట మొదలైన తరువాత ఈ ప్రవృత్తి కావ్యలోకమునకు వచ్చినది. సంప్రదాయమన్న కవులకు రక్తి హెచ్చినది. ఈయన కావ్యముల వలన గుడ్డిగా పాశ్చాత్య నాగరకత వెంటబడిపోవుటను నిరసించినాడు. ఆర్షములైన ధర్మములయొక్క ఔజ్జ్వల్యమును పేర్కొనినాడు. ఆయన యనేకాభిప్రాయములతో నేకీభవించనివారు కూడ ఆయనయొక్క కవిత్వమునందు కలిగిన సంప్రదాయపు మలపునకు కారణమనుటను, తిరస్కరింప లేరు. విశ్వనాథ తన రామాయణమునందు 'జీవుని వేదన' యని చెప్పిన విషయము కావ్యశిల్ప పరమార్థముగా వ్యాఖ్యానము చేయబడుచున్నది. శ్రీ శ్రీ కూడ "సదసత్సంశయము" చివర 'తప్పదు జీవికి వేదన' అని చెప్పికొన్నాడు. ఇరువురికి ఎంత

భేదమున్నట్లు పైకి గోచరించినను ఉన్నత స్థాయిలో నిర్వురు నొకటియే ప్రకటించినారు. విశ్వనాథ వన్నయను, కాళిదాసును, పెద్దనను మరల వ్యాఖ్యానము చేసినాడు. ప్రాచీన కథాకథన వైఖరి, రస మార్గము అన్న వానియొక్క ప్రాధాన్యము కావ్య లోకమున ప్రతిష్ఠితము లొనరించి యున్నాడు.

ఖండికలుగా సాగిపోవుచున్న తెలుగు సాహిత్యము ఈ దశాబ్దములో ప్రధానముగా కావ్యమార్గమును చేపట్టినది. గీతి రచన ఎంత లలితమైనను రసమార్గమునకు చెందిన కావ్యముతో దీటురాదు. అందువలననే ప్రతి కవియు కావ్యరచనము చేయుటకు పూనుకొనుచున్నాడు. ఈ కావ్యములు కూడ పూర్వ మార్గములో రచించువారు కొందరు, ఆధునికమైన మార్గములో రచించువారు కొందరును. అభ్యుదయ కవితా మార్గమునుండి వచ్చిన ఈతరము కవులుకూడ కావ్యరచనకు ప్రారంభము చేయుచున్నారు.

ఈ కాలముననే విశ్వనాథవారి రామాయణము లోని చాల భాగము ప్రచురింపబడినది. ఈ రచనము ఆయన దీక్షగా నిర్వహించుచున్నారు. ఈ రచన వలన ఆయన తెలుగు కవిత్వములో అనేక విధములైన శిల్పమార్గములకు మూలస్థానీయుడగుచున్నాడు. సర్వ కవిత్వ మర్మవిదుడాయన. ఈ మహాకావ్యము ఆయనను ఇంతకుముందు తెల్పిన మహాకవులతోబాటు ఆయననుకూడ నొక మహాకవిని చేసినది.

ఆయన వలన ఈతరము కవులు పద్యరచన నేర్చిరి. పలుకుబడులు నేర్చిరి. కావ్య రచనము నేర్చిరి. కవితా శిల్పముల నేర్చిరి. రామాయణము వ్రాయుటలో నాయన రసమునకున్న ప్రాధాన్యము తెలిపినాడు. ఆయన కిన్నెరసాని వ్రాసి గేయ కావ్యము నెట్లు తీర్పవచ్చునో చూపినాడు. ఇది వస్తు బలముగల గీతికావ్యము. శ్రీ కురుగంటి వారు చెప్పినట్లు ఆయన మూడు సాహిత్య మార్గములకే కాక శ్రీమద్రామాయణ కల్పవృక్షముతో కావ్య మార్గమునకు కూడ ఆధునిక కాలములో ప్రధానస్థానమైనాడు.

ఈయన ప్రధానముగా అద్వైత మార్గమునకు చెందినవాడు, వేదాంతి. కాని అధునాతన పాశ్చాత్య తత్త్వ మార్గముల నెఱిగినవాడు. ఆయనకు మనస్సుయొక్క లక్షణము చెప్పుటయన్న నెక్కువ యిష్టము. ఆయన కావ్యములలో జీవలక్షణము, మనోవృత్తి వ్యాఖ్యానించుటవలన పాత్రలయొక్క ఉన్మీలనము మనకు చక్కగా తెలియవచ్చును. ఈ విషయము తెలియుటకు ఆయన రామాయణము పరిశీలింపవలయును.

విశ్వనాథ సత్యనారాయణ గారి ఆధ్యాత్మిక ప్రేరణ, రసమార్గ ప్రతిష్ఠ, ధర్మముయొక్క ప్రాధాన్య స్థితి తెలుగు సాహిత్యములో నిలద్రొక్కుకొన్నది.

ఈ సంప్రదాయము ప్రాణశక్తి. అది త్యజించిన జాతి నిర్జీవమైపోవును. కొన్ని సంవత్సరములకు పూర్వము సాహిత్యములో నొక 'రావణకుల' ముండెడిది. ఈ కులమువారికి పురాణములు, ఇతిహాసములు, అబద్ధములు, కొందరు స్వార్థపరులు కల్పించిరి. అని వాని జోలికి పోకుండ వీరూరుకొనలేదు. రావణుడు గొప్పవాడు. సీతను రామునికన్న రావణుడే ప్రేమించెను. వశిష్ఠుడు దుర్మార్గుడు రామునిచేత శంబుకవధ చేయించినాడు. ప్రహ్లాదుడు స్వార్థపరుడు. హిరణ్యకశిపుడు భక్తుడు. ఈ విధముగా ఈ రచనలు సాగినవి. కాని వానికి ఈ దేశములో స్థితిలేదు. ఏలననగా ఆయా పాత్రలు దేశములోని పంచభూతములలో ఆ యా విధముల ప్రతిష్ఠితము లైనవి. వానిని వేరొక విధముగా, వానికి వ్యతిరేకముగా, వ్యాఖ్యానము చేయబూనుట వ్యర్థ ప్రయత్నము. 'అశోకం', 'నరసింహావతారం'

మొదలైన ఈ రచనలు రచయితలయొక్క అవ్యవస్థితమైన మనస్థితిని మాత్రము సూచించినవి.

ఈ దుష్టమైన మార్గము ఈ కాలమున వెనుకబట్టినది. ఈ రావణ కులమునకు సాహిత్యములో స్థానము లేదు. సంప్రదాయముయొక్క స్వరూపమును గూర్చి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారొకచోట నిట్లు చెప్పినారు.

ఒక జాతి జాతీయతకు సంప్రదాయమ్ము
ప్రాణభూతమ్మది ప్రాణశక్తి.
భద్రమ్ముగా జూడ పై మెరుంగులు లక్ష
సంప్రదాయంబును జంపలేవు

పై మెఱుంగులయందు ప్రాణశక్తి భ్రాంతి
తనరిన జాతీయత నశియించు
సంప్రదాయేతర చటుల ధీసంభూత
విప్లవానిలములు వీవకుండ

ఆంధ్రములయందు సంవ్యాప్తమైన పంచ
భూతముల గుణంబులు భద్రముగ మహాంధ్ర
గగన గుణ సంప్రదాయ రక్షా విభూతి
తనరు గావున యోగ్యహస్తగతమగును.

ఇది యేతత్స్వరూపము.

ఈ ప్రాణభూతమైన శక్తిని పై మెఱుగులు చంపలేదు. వానియందు మనకు ప్రాణశక్తి భ్రాంతి లేదు. అందువలననే దీనిని చంపుటకు ఎన్ని విప్లవములు వచ్చినను అది స్థిరముగా సనాతనముగా నిలచినది.

సంప్రదాయము అనినంతనే పరభాషలలోని ఉత్తమత్వమును గ్రహింపలేకపోవుటకాదు. ఆ యా కావ్యములను చదువుకొనవచ్చును. వాని వలన ఆనందింపవచ్చును. కాని వాని పలుకుబడి తోవన మన కావ్యముల రచించుపని కూడదని మాత్రమే. "ఆకాశాత్పతిత తోయం యథా గచ్ఛతి సాగరం" అన్నట్లు సర్వములైన క్రొత్తలును ఈ సంప్రదాయ ధర్మమునందు లీనము కావలయును.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అధినేతగా సాగుచున్న ఈ కవితా ప్రస్థానమునకు ప్రధానములైన లక్షణము చెప్పబడినది. ఇది కాక ఈయన రచనవలన వ్యుత్పత్తి వైపునకు కవుల దృష్టి ప్రసరించినది. వ్యుత్పత్తి దరిద్రులైన కవులు ఎంత ప్రతిభావంతులైనను ఎదుగలేరు. వారి ఎదుగుదల ఆగిపోవును. భావకవులు, అభ్యుదయ కవులు చాలమంది ఈ ప్రకారముగనే ఆరిపోయినారు.

ఛందస్సులలో నూతన ప్రయోగములు వీరనేకముగా చేయుచున్నారు. వీరికి పూర్వచ్ఛందమని, వచన పద్యమని భేదము లేదు. సాధారణముగా యే కొందరోతప్ప అందరును గణ, మాత్రాచ్ఛందస్సులతోపాటు వచనపద్యమును కూడ వ్రాయుచున్నారు. ఈ ఛందోవైవిధ్యమే వీరి రచనలలోని వైవిధ్యమునకు కారణమైనది.

మానవత్వంలాగా ఉన్నతమైన ఆకాశం అంచుల్నీ, దానవత్వంలాగా అగాధమైన సముద్రం, తాకుతూ వున్న చోట ఒంటరిగా నావ సాగుతూంది.

సముద్రం దట్టంగా వుంది. లోతు నల్లగా వుంది. నీరు నిండు చూలాలులాగా వయ్యారంగా కదులుతూంది. తరంగాల వూపుతో వూగుతూ నావ సాగుతూంది. పెద్ద పెద్ద చేపలు ఈదుతున్నాయి. భయంకరంగా సుడులు తిరుగుతూ అలలు లేస్తున్నాయి.

నల్లని జలంమీద నావ వుంది. దూర తీరాలలో భూమి మేర కనిపించటం లేదు.

సాయంకాలం దాటింది.

నావ కుంటుతూవుంది.

చిమ్మచీకటి క్రమ్మింది. నావలో లైట్లు లేవు.

సముద్రంలో నీటితాకిడి వినవస్తూ వుంది. నావలో భరింపరాని నిశ్శబ్దం పరవళ్ళు త్రొక్కుతూంది.

నావ ఇంజను చెడిపోయింది. మోర్స్ కోడ్ టేబిల్ పగిలిపోయింది. టెలిఫోను సెట్ ఛిన్నాభిన్నమయింది. దిక్‌సూచి బ్రద్దలయింది. సిగ్నలింగ్ ఫ్లేగ్స్ లేవు.

నావకూ భూమికీ సంబంధం పోయింది. నావ స్వశక్తి నశించింది. నడి సముద్రంలో నావ భారం దేవుడిమీద వుంది.

# లోతు గుండెలు

"కాలకలూరి"

ఎటు వెళ్ళాలో తెలియకుండా నావ నడుస్తూంది.

కొంచెం దూరంలో మరి కొంచెం ఎత్తులో ఏదో వెలుతురు మినుకు మినుకు మంటూ కనిపిస్తూంది.

నావ అక్కడకు చేరితే ఒకనెక్కు తెలుస్తుంది.

వెలుగువైపు నావ తిరిగింది. గాలి వాలుకూడా అటేవుంది. నావ నసుగుతూ నడుస్తూంది.

విశాలంగా వున్న చోట జనం ఒకడిని కొడుతున్నారు. వాడి వళ్ళు వాచిపోయింది. నోటివెంట మాట లేదు. వాడు పనివాడు. నావలో టెలిఫోన్ నావికుడికి సహాయపడేవాడు. పనివాడు సన్నగా ఎత్తుగా బలంగా వున్నాడు. తెల్లబట్టలు నూనె మరకలతో డాగులు పడివున్నాయి. పవిత్ర భావాలు చూపించే లక్షణాలు

ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. పనివాడిని బోడినెత్తివాడు స్ప్రహతప్పిపో యేట్టు కొట్టాడు. ఎర్రగావున్న బొద్దు మీసాలవాడు కట్టివేశాడు.

అధికారి నెమ్మదిగా వున్నాడు. దయార్ద్రహృదయుడు లాగా కనబడుతు న్నాడు. కర్తవ్య నిర్వహణ విషయంలో అచంచలమైన ప్రజ్ఞ వున్నవాడు. అధికారి అధీనంలో నావ నడుస్తూంది. అధికారి ప్రభుత్వ ప్రతినిధి.

అధికారి ఒక గదిలోకి వెళ్ళాడు. జాలిగా చూశాడు. గదిలో ఖైదీవున్నాడు. నిర్లిప్తంగా నిద్రపోతున్నాడు. ఆకాశంలో స్వేచ్ఛగా ఆడుకునే చంద్రుడు సముద్రంలో చిక్కిపోయినట్లు ఖైదీ నిద్రపోతున్నాడు. ఖైదీ ముఖం చాలా నిర్మలంగా వుంది. ముఖ భంగిమల్లో భయం తెరలవెనుక లీలగా ప్రమి దలాగా స్వచ్ఛత ఏదో వెలుగుతూంది. కళ్ళలో నమ్రకాంతి తొంగిచూస్తూంది. ఖైదీకి ఉరిశిక్ష విధించారు. ఖైదీ ఆఖరి కోరిక ప్రకారం అతని స్వస్థలంలో ఆ శిక్ష అమలుజరుపబడుతుంది. అందుకే తీసుకుపో బడుతున్నాడు.

ఖైదీ నిద్రపోతున్నాడు. ఉరిశిక్ష పొందటానికి వెళ్ళుతున్న ఖైదీ ఏ వ్యూహా లేకుండ హాయిగా నిద్రపోతున్నాడు.

అగ్గిపుల్లలు గీస్తే వచ్చే వెలుగూ, బేటరీ లైటు వేస్తే కలిగే కాంతీ, నావలో అక్కడక్కడా అప్పుడప్పుడూ కనిపిస్తూవుంది. జనం మృత్యుముఖంలోవున్నారు. భయంతో ఆందోళన చెందుతున్నారు. సముద్రంలో తరంగాలు రేగినట్లు హృదయంలో భయం తెరలు వూగుతున్నాయి. ఏ క్షణంలో ఏం జరుగుతుందో ఎవరికీ ఏమీ తెలియటంలేదు. ఒక్క క్షణం కొన్ని కోట్ల యుగాలు కాలం లాగా గడుస్తూవుంది.

ఖైదీ హత్యచేశాడు. పట్టరాని ఆవే శంతో పరాభవాగ్ని దహిస్తూవుంటే పది మందిని హత్యచేశాడు. బాగా బలశాలి.

ఖైదీ గొప్ప ఈతగాడు. ఇష్టంలేక పోయినా హత్యచేసి తప్పించుకోవటానికి గత్యంతరం లేక మూడు మైళ్ళు ఈది నిర్ణీత స్థలం చేరుకున్నాడు. అక్కడ దొరికిపో యాడు, జైల్లో పెట్టారు. అక్కడ్నుంచీ తప్పించుకున్నాడు. రెండు రోజులు నదిలో దాక్కున్నాడు. ఆ తరువాత దొరికాడు. ఉరిశిక్ష విధించారు. శిక్ష కొనసాగించటా నికి తీసుకు వెళుతున్నారు. ఈతలో ప్రపంచ ప్రఖ్యాతిపొందిన ఖైదీ ఖ్యాతి కార ణంగా పట్టుబడ్డాడు. అతను గొప్ప ఈతగా డని లోకానికి తెలియకపోతే పోలీసులుకి అంతుచిక్కేవాడు కాదు. ఖైదీ చేతులుకి సంకెళ్ళు వున్నాయి. కాళ్ళకు లేవు. ఈతకు కాళ్ళు బాగా ఉపకరిస్తాయి. అధి కారి గమనించాడు. కాళ్ళకు సంకెళ్ళు వేశాడు. కర్తవ్యం నిర్వర్తించాడు. ఖైదీ నిద్రలేచాడు. కాళ్ళూ చేతులూ తాలకం

చాడు. భూమి కనిపించక పోవటం ఊహించాడు. భయంకర మృగాల సముద్రం పరికించాడు. పేలవంగా నవ్వి ఆవులించి నిద్రపోయాడు.

దూరంగా వెలుతురువుంది. నావ అటువైపే కదులుతూవుంది. చలిలో వళ్ళు వాచి స్పృహతప్పి పడివున్న పనివాడు పసివాడులాగా మెల్లిగా లేచాడు. పనివాడు నావని నాశనం చేశాడు. అందుకు కారణం ఖైదీతో అతను మాట్లాడటమే!

నావ సముద్రంలో ప్రయాణం చేయవలసిన కాలం ఐదు రోజులు. మూడు రోజుల క్రితం నావ పాడయింది. అప్పటికి నావ బయలుదేరి ఏడు రోజులు. సరిగ్గా ప్రయాణం సాగివున్నట్లయితే ఎప్పుడో నావ ఒడ్డుకు చేరివుండేది.

ఖైదీ హత్యా విషయమూ, అందుకు కారణాలు పనివాడు విన్నాడు. న్యాయస్థానం ఇచ్చిన తీర్పు భావ్యంగా లేదని పనివాడు భావించాడు. ఖైదీ ఉరిశిక్ష పొందకూడదు. నావ ఒడ్డుకు చేరితే ఖైదీని చంపుతారు. ఖైదీ బ్రతకాలి అంటే నావ ఒడ్డుకు చేరకూడదు. అంతే అతను ఆలోచించింది. అందుకే అందుబాటులోవున్న అన్ని పనులు చేశాడు. అయితే ఫలితం ఏమయింది? ఖైదీ జీవిత ప్రమాణమయితే రెండు రోజులు పెరిగింది కాని వందలమంది జీవితకాలం చాలా తగ్గిపోయే సూచనలు కనబడుతున్నాయి. అతని పనివల్ల నావలో ప్రతి ప్రాణీ ప్రమాదంలో పడుతుందనీ, చివరికి ఎవరికి మేలుచేద్దామని భ్రమించాడో అతనికీ తనకూ కూడ అది ఆపదేననీ పనివాడు గుర్తించలేకపోయాడు.

అతనికి పరిస్థితి అర్థమయింది. మనస్సు చాలా నిర్మలంగా వుంది. కోపం బాగా తగ్గింది జాలి మరీ పెరిగింది. భయం ముసురుకుంది.

మూగనావ ముఖాన నవ్వు లేకుండా దూరంగా నవ్వే వెలుతురుకోసం నడుస్తూవుంది.

సముద్రంలో పోటుపుట్టింది. మిలమిలలాడే నక్షత్రాలు మరుగుపడుస్తూ పొగలాంటి మంచు ఆకాశం అంతా ముసురుకుంది. గాలి వేగంగా తోలుతూవుంది. అల్లకల్లోలంగా తరంగాలు లేస్తున్నాయి. నావ కుదిలిపోతూ కదిలిపోతూంది. అలలు పెద్ద ఎత్తున లేస్తున్నాయి. నావ మునిగిపోతుందేమో నన్నంత భయంగా వుంది. సముద్రంలో తుఫాను రేగింది. నీరు లేచి పడుతూంది.

వెలుతురు దరిదాపుకి నావ చేరింది. కొన ప్రాణాలతో గుండెలు బిగబట్టి ఊపిరి పీల్చలేక బాధపడుచున్న జనం అల్లాడి పోతున్నారు.

పనివాడిని కట్టివేశారు. ఖైదీకి సంకెళ్ళు వున్నాయి. అధికారి నిర్విరామంగా నావ అంతా కలయ దిరుగుతున్నాడు.

నావ ఆగింది. వెలుతురు దగ్గరయింది. భయం పెరిగింది. అలల ఘోష, నావ మోత, తుఫాను ధ్వని, జనం గుండెల చప్పుడు వినబడుతూవుంది. ఆశతో ఎదురు చూచిన జనం హృదయాలలో పర్వతాల ఎత్తైన నిరాశ పేరుకుపోయింది. ఎదుట ఎత్తైన పర్వతం భయంకరంగా నిలబడివుంది.

సముద్రంలో దోవతప్పిన నావలు పర్వతానికి తగిలి పగిలిపోకుండా జాగ్రత్త పడేందుకు పిలుగావున్న వెలుతురు చూచి అర్థంలేని ఆశతో వచ్చిన నావ నిరాశతో నీరసించి వణికిపోయింది. తుఫాను విపరీతంగా వుంది. అధికారి నావలో తెరెత్తిల్ని తిప్పుతున్నారు. పర్వతం సమీపంలో నావ ఆగివుంది. అలలు లేచాయి. నీరు పైకి పొంగింది. నావ ఎత్తుకి ఉరికింది. నీరు తగ్గిపోయింది. నావ కొండను కొట్టుకుంది. జనం ప్రాణాలు అరచేతుల రేఖల కొసల్లో పెట్టుకొని వున్నారు. అలల వాడికి నావ మళ్ళీ రాతికి తగిలింది. అలా చాలా సార్లు తగిలి, చివరకు పగిలింది. నావలోకి నీరు వస్తూవుంది.

ఖైదీ అసహాయంగావున్న గదిలోకి అధికారి పరుగెత్తాడు. ఖైదీ ఏ చీకూ చింతా లేకుండా నిద్రపోతున్నాడు. అధికారి ఖైదీని పైకి తీసుకువచ్చి పనివాడి దగ్గర కూర్చోబెట్టాడు. నావలోకి నీరువస్తూవుంది. పనివాడు కట్టివేయబడి వున్నాడు. ఖైదీకి సంకెళ్ళు వున్నాయి. అధికారి ఆందోళనగా తిరుగుతున్నాడు. నావలోకి పలిగినచోట నీరు వస్తూవుంది. అలలు పెద్ద పెద్దగా లేచి పడుతున్నాయి. జనం ప్రాణాలమీద ఆశలు వదులుకున్నారు. దైవ ప్రార్థన సాగుతూ వుంది. నావ వణుకుతూవుంది. బందీల కళ్ళల్లో తుఫాను అలలకంటే వేగంగా కన్నీరు జారింది.

తూర్పున వెలిరేఖలతో వేకువ కనిపిస్తూ వుంది.

మరొక్కసారి కొండను తగిలి నావ పూర్తిగా పగిలిపోయింది. తుఫాను ప్రళయంగా వుంది. అలలు ప్రచండంగా లేస్తున్నాయి. నావ పర్వతానికి తగిలింది ముక్కలు ముక్కలయింది. జనం మునుగుతున్నారు. అలలు దుప్పట్లు కప్పుతున్నాయి. సముద్రం చేపలు విజయ విహారం చేస్తున్నాయి.

అధికారి ఈదుకొని వెళ్ళి పర్వతం చేరాడు. జారుతున్న నాచుని దాటి పర్వతం ఎక్కాడు. సముద్రంలో చేపలు, మనుష్యుల శరీరాలు, నావ చెక్కలు, అలల తలలు కనిపిస్తున్నాయి. బంధింపబడివున్న ఇద్దరూ అసహాయంగా మునిగిపోతున్నారు.

తుఫాను తగ్గుముఖం పట్టింది. పగిలిపోయి ముక్కలయిన నావచెక్కలు జనం ఎక్కారు. కొంతమంది మునిగిపోతున్నారు. వాళ్ళుకూడా ఏదో ప్రాణ ప్రయత్నం చేస్తున్నారు. బందీలవైపు చూస్తున్న అధికారి

గుండెలో నవచైతన్యం వచ్చింది. మధుర భావన లేచింది. కరుణ ఉదయించింది, మానవత్వం మేల్కొంది.

సూర్యుడు సముద్రం నీళ్ళలోంచి ఎర్రగా పైకివచ్చాడు.

అధికారి వేగంగా సముద్రంలో దూకాడు. తొందరగా బందీలు మునుగుతున్న తావుకి పోయాడు. కళ్లు విప్పాడు. సంకెళ్ళు తొలగించాడు, ప్రభుత్వ అధికారిగా దుర్మార్గుల్ని బంధింపవలసిన అతను మానవత్వ మార్గంలో విహరించాడు. అధికారి ప్రయాసంతో కొండమీదకు చేరాడు. బంధాలు విడిపోయిన ఇద్దరూ కొండవైపు ఈదుతున్నారు. ఇద్దరూ వెనక్కిచూశారు. అయితే పనివాడు కొండ ఎక్కాడు. ఖైదీ వెనక్కి వెళ్ళాడు. పనివాడు కొండమీది నుంచి సముద్రంలోకి ఖైదీకోసం చూశాడు.

ఎక్కడో నావ చెక్కలు కూడా సహాయం లేకుండా మునిగిపోతున్న జనంలో ఖైదీ కనిపించాడు. ఖైదీ నలుగుర్ని భుజాల మీద పెట్టుకొని కొండవైపు ఈదుతున్నాడు.

అలల తాకిడి ముమ్మరంగా వుంది. నెత్తిమీద బరువు వుంది. చాలా కష్టంగా ఈదుతున్నాడు. ఆ నలుగురికీ స్పృహ లేదు.

ఖైదీ కొండ ఎక్కాడు. నలుగుర్నీ దించాడు. శ్వాస చూశాడు. మళ్ళీ సముద్రంలోకి వెళ్ళాడు. ఖైదీ మీదికి ఏదో పెద్దచేప వచ్చింది. చేప మింగబోతూ వెనుదిరిగి వెళ్ళిపోయింది. అలలు ముసుగు వేస్తున్నాయి. నీటిలో మునిగిపోతున్న జనాన్ని ఖైదీ కొండమీదకు చేరుస్తున్నాడు. ఖైదీ జనాన్ని రక్షిస్తున్నాడు.

స్వర్గ సుఖాల శోభలతో సాగుతున్న తన కుటుంబ వ్యవహారాల్లో అనవసరంగా అడ్డంవచ్చి జోక్యం కలిగించుకొని నరకాన్ని సృష్టించి చూపి తనని రాక్షసుడిగా తయారుచేస్తే పదిమందిని చంపిన ఖైదీని వందల మందిని రక్షిస్తున్నాడు.

పనివాడి హృదయం తొణికింది. శ్వాస భ్రంశం పొందేట్టుగా కదిలింది. పనివాడు మానవత్వం పొందాడు. సముద్రంలోకి వెళ్ళాడు.

తనని స్పృహపోయేట్టు కొట్టిన గోష్టి నెత్తివాడు మునిగిపోతున్నాడు. తనని కట్టివేసిన బొద్దుసూత్రాలతో చల్లగావున్న వాడు కర్మరూపంలో వచ్చి మింగబోతున్న చేపకు బలికాబోతున్నాడు.

పనివాడు వేగంగా ఈదాడు. చేపను తరిమాడు. ఇద్దరినీ ఒడ్డుకు చేర్చాడు. ఖైదీ, పనివాడు ఇద్దరూ నావలోనుంచి సముద్రంలోపడి మునిగిపోబోయిన జనాన్ని చాలా వరకు కొండమీద చేర్చారు. తుఫాను లేని సముద్రం మధ్య పర్వతంమీద ఏ ఆవేశమూ లేని జనం నిరామయంగా కూర్చున్నారు. ఏది ఏమవుతుందో ఎవరూ ఏమీ ఎలానూ వూహించలేకుండా వున్నారు.

సముద్రం చాలా గంభీరంగా వుంది. పగిలిపోయిన నావ ఛాయలు కనబడుతున్నాయి. సూర్యుడు వెచ్చని కిరణాలు పంచిపెడుతున్నాడు. ఆకలి దహించుకుపోతూంది. ఖైదీ వూహించాడు. నావ ఒడ్డుకు చేరకపోవటమూ, సముద్రంలో తుఫాను పుట్టటమూ తెలుసుకున్న లోకం జనాన్ని ఎలాగ్గో రక్షిస్తుంది. అప్పుడు తనకు ఉరిశిక్ష విధిస్తుంది. బలవంతంగా చావకూడదు.

సముద్రంలో స్వేచ్ఛగా కష్టంవచ్చి సంతసేపు ఈదులాడి ఏ తిమింగలమో మింగితే ప్రాణం వదిలిపెట్టటం హాయిగా వుంటుంది. వెంటనే లేచి చకచకా నడిచి పర్వతం శిఖరం మీదికి వెళ్ళాడు. దూకబోయి ఆగిపోయి వెనక్కు చూశాడు. తన కాపలామీద చనిపోవటం బ్రహ్మ నిర్ణయమైవున్నప్పుడు కర్తవ్యం నిర్వర్తించలేని అపనింద అధికారికి రాకూడదు. నెమ్మదిగా వెనుతిరిగి మెల్లగా నడచి అధికారి దగ్గరకు వచ్చి ఖైదీ కూర్చున్నాడు. కాళ్ళకూ చేతులకూ ఏ సంకెళ్ళూ లేకుండా హృదయ సంయమనం తోంచి అధికారి కాళ్ళదగ్గర సహానింగా మౌనంగా ఖైదీ కూర్చున్నాడు.

అధికారి శరీరం జ్వరం వేడితో పేలిపోతూవుంది. తల నొప్పితో పగిలిపోతూ వుంది. ఖైదీ అధికారిని తొడమీద పడుకోబెట్టుకున్నాడు.

పనివాడు ఆలోచించాడు... నావ పగిలిపోవటానికి కారణం తను. ప్రభుత్వం తనని విడిచిపెట్టను. పైకి అనేశాడు. అధికారి ఆర్ద్ర నయనాలతో పనివాడివైపు చూశాడు. అభయహస్తం నెత్తి పనివాడి తల నిమురుతూ నీ కేభయమూ అక్కర లేదు నేనున్నాను అన్నాడు. అంతకంటే దయారసార్ద్రమై కృతజ్ఞతాభావం సూచించే ట్టగావున్న దృక్కులతో ఖైదీవైపు చూచి అధికారి నెమ్మదిగా తలవంచుకుని వూరుకున్నాడు.

అందరూ ఆకాశంలోకి చూస్తున్నారు. ఆ సాయంకాలం విమానం వచ్చింది. ఆకాశంలో మెల్లగా తిరుగుతున్న విమానంలోకి అందరూ చేరారు. విమానం మేఘాలలో కదిలింది.

దానవత్వంలాగా లోతైన సముద్రంలోని పర్వతం విడిచిపెట్టి మానవత్వంలాగా ఎత్తైన ఆకాశం ఆశా ఆశాంతరాలలోకి విమానం ఎగురుతూ ఎగురుతూ సాగి సాగి వెళ్ళిపోయింది.

# కాలగ్రంథి

కె. రామారావు

ఏనాడో చీకటిపడి ఇంకా తెల్లారలేదు
తెగిపోయిన కాలానికి ఇంకా ముడివేయలేదు
ఆర్పినవిద్యుత్తు వెల్గుటెల్లాగో తెలియరాదు.

ఆశామోహాలకు జన్మించిన ద్వేషం
ఊహాలకూ కోర్కెలకూ పొత్తుకూర్చు లోభం
కామంతోకూడి దుఃఖమై పోయినసౌఖ్యం.

తమశ్ఛోలి కాలంకృత వక్షమ్ములు
పరిభ్రమణ వేగరవ కింకిణీ చరణమ్ములు
ఈ జీవితరంగస్థల నిపుణ నిత్య లాసికలు.

గగనానికి గతకాలం వేసిన పెను నిశ్రేణిక
ఈ లాస్యంలో మునిగినప్రాణి ఎక్కలేదిప్పుడు
ఈ లాసిక లింతలోనె ఈ జీవిని వదలబోవు.

వాయుతరంగాలపైన కదులుతున్న శాంతిగీతి
వాయువు లోపొరలలోన వ్యాపించిన రక్తధ్వని
ఇరుచెవులున్నందుకొరకు అనుభవసాంకర్యం జీవికి.

తెగిపోయిన కాలానికి ముడివేసెయ్, త్వరగా
తెల్లారక ఏంచేస్తుం దెంతసేపు చూస్తావిక
ఈ లాస్యం అనుభవాలు ఇక భరింప లేదు జీవి.

# వర్ణనలు

శ్రీనివాసమూర్తి.

కావ్యమునం దష్టాదశ వర్ణన లుండవలయు నన్నది ఆలంకారికుల మతము. అయితే ఈ పదు నెన్మిది వర్ణనలన్నియు తప్పక ప్రతి కావ్యమునం దుండ వలయు ననుట నియతమైనట్లు కనిపించదు. సంపూర్ణముగా నీ పదునెన్మిది వర్ణనలు తప్పనిసరిగా నున్న కావ్యములను వేళ్లమీద లెక్కింపవచ్చును. అనేక కావ్యములందు కొన్ని కొన్ని వర్ణనలు మాత్రమే వీనినుండి గైకొనబడుచున్నవి. ఆ కారణముచే నీ పదునెన్మిది వర్ణనలు తప్పక కావ్యమునం దుండవలయుననుట నియతము కాదని తేలును.

ఈ వర్ణనలయొక్క సంఖ్యా విషయమున కొంతమంది ఆలంకారికులు మత భేదమును వ్యక్త పరచినారు. వారు మరి కొన్ని వర్ణనలను చేర్చి సంఖ్యను పెంచుట జరిగినది. అధికాలంకారికులు మాత్రము పదునెన్మిది యన్న సంఖ్యనే ఒప్పుకొనినారు. సంఖ్యావిషయమునందు వలెనే వర్ణనలను పేర్కొనుటయందును మతభేద మున్నది. ఈ మత భేదము సూక్ష్మాంశములపై నాధారపడినదే కాని వర్ణనలయొక్క వ్యవస్థకు మాత్రము భిన్నముగా పోయినది కాదు.

కావ్యము లోకము ననుసరించి ఉండునదే కాని లోకమును వదిలి దూరముగా నుండునది కాదు. ఆ కారణముననే నితరములయిన అనేక విషయములతో బాటు లోకమునుండియే కావ్యమునందీ వర్ణనలు ప్రవేశించినవి. నిజమునకీ వర్ణనలన్నియు కావ్య సౌందర్యమును పెంచునవియే కాని కావ్యమునకు బంధనములుగానయి దాని సౌందర్యము నపకర్షించునవి కావు. కావ్యమునందు, కావ్యగత వస్తువున కనుగుణముగా కవి వీని నుపయోగించుకొనుట యందలి నేర్పుతో నివి రుచ్యములగుచున్నవి. నేర్పులేని పట్ల ఎట్టిదయినను ఆకర్షణీయముగా నుండదు.

మానవునియొక్క మనోలక్షణము, ప్రవృత్తి నాధారముగా చేసికొని సాహిత్య శాస్త్రమునందు రస సిద్ధాంత మేర్పడినది. ఎట్టి మనోలక్షణమైనను, మనఃప్రవృత్తి అయినను, మానవ స్వభావమును సమాలోచించి నిర్ణయించిన సాహిత్య శాస్త్రమునందలి ఏదో ఒక రసమునందు తప్పక అంతర్భూత మగుచునే యున్నది.

కావ్యమునం దుపయోగించవలసిన వర్ణనల విషయమున గూడ నిట్టి పద్ధతినే సాహిత్య శాస్త్ర మవలంబించినది. కావ్యమునందు మానవుని యొక్క జీవిత ప్రవృత్తిని చిత్రించుట ముఖ్యమైన విషయము. మరి మానవుని జీవితమును సంపూర్ణముగా నభివర్ణించుటకే యే విషయములను గ్రహించి వర్ణించవలసి యుండునో, ఆయా విషయములను వర్ణన చేయవలసినదిగా సాహిత్య శాస్త్రముయొక్క అభిమతము. మానవునియొక్క పరిసరములు, అతనిపై ప్రకృతిప్రభావములు, అతడు దానిని లక్షించిన విధము; అతని గార్హస్థ్య జీవనము, సుఖ దుఃఖములు, అతని సంతానము మొదలగునవి అతని జీవితమును అభివర్ణించుటకు తగిన విషయములు. వీని వలన మానవ జీవితములోని తత్వము గోచరమగును. కావుననే నీ విషయము లన్నిటిని వర్ణించవలయునని కావ్యశాస్త్రము చెప్పుచున్నది. వివిధ స్థితులలోని వారి జీవితాభి

వర్ణనమునకు వీలుగా నుండునట్లుగనే, సమాలోచ
నము జరిపి ఈ వర్ణనలను నిశ్చయపరచినట్లు ఆ
శాస్త్రమునందు చెప్పబడిన వర్ణనలయందే సర్వవిధ
జీవిత విధానములు సూక్ష్మ సూక్ష్మ భేదములతో
నంతర్లీనము లగుచున్నవి. ఈ దృష్టితో కావ్య
ముల యందు వర్ణనలయొక్క ప్రవేశము జరిగినది.

కథా కావ్యములయందీ వర్ణనలు కథ కనుగు
ణముగా ప్రవేశించుచున్నవి. కథకాని, లేక కథ
యొక్క ప్రాధాన్యముకానీ లేని కేవల వర్ణణాత్మక
కావ్యములు, వర్ణనాప్రధాన కావ్యములు కూడ
నున్నవి. ఇట్టి కావ్యములయందు జీవితము పూర్ణ
ముగా చిత్రింపబడవలె ననుట కుదురదు. జీవితము
నందు సంభవించునట్టి, లేక తారసిల్లునట్టి కొన్ని
కొన్ని విషయముల వరకే ఇవి పర్యాప్తము లగు
చున్నవి. ప్రకృతి, కాలగమనము మొదలైన విష
యములను మాత్రమే అభివర్ణించు కావ్యములందు
కథకు అవకాశము లేదు. అట్లే జీవిత సంపూర్ణ
తను చిత్రించుటకు కూడ అవకాశములేదు, జీవి
తములోని ఏకదేశమునకు మాత్రమే ఇవి సంబం
ధించినవి. 'ఋతు సంహారము' వంటివి ఈ కోవకు
చెందిన కావ్యములు,

వర్ణనలయొక్క మూలమైన ఉద్దేశ్యము సరిగా
తెలియనివారి కావ్యములందు, వాని నుపయోగించు
కొను నేర్పు తగ్గినవారి కావ్యములందు కథకు కథ,
వర్ణనలకు వర్ణనలు_ తీర్థమునకు తీర్థము, ప్రసాద
మునకు ప్రసాదమువలె_ విడి విడిగా ఉండుట జరి
గినది. కావ్యమునందీ వర్ణన లుండవలయునన్న
దానిపైననే వారికి ఆస్థ, అంతేకాని వానిని కావ్య
విషయమునకు సహకారములగునట్లుపయోగించు
కొనుటయందా ఆస్థ కనుపించదు. దీని వలన కొన్ని
కావ్యములయందు వర్ణనల వరకు అవి బాగుగనే
ఉండిన ఉండవచ్చుగాని కథా వస్తువు దృష్ట్యా ఔచిత్య
వంతములు కాకపోవుచున్నవి. ఇట్టివాని వలన
వర్ణనలు కావ్యమునకు తప్పని బంధములైనవను
అభిప్రాయము కలుగుటకు అవకాశము కల్గినది.

కావ్యమునందు వర్ణనలు పాత్రలయొక్క
మనోభావముల కనుగుణముగా, అక్కడి సందర్భ
మున కనువుగా చేయవలసి యుండును. వర్ణ్యము
ఒక్కటియే అయినను సందర్భమునుబట్టి వర్ణించు
పద్ధతియందు భేద మేర్పడును.

నల దమయంతు లడవులలో తిరిగినప్పటి
వారి పరిస్థితియు, సీతా రాము లడవులలో తిరిగినప్పటి
వారి పరిస్థితియు ఒక్క విధమయినవి కావు. వారి
యప్పటి అనుభవములయందు సంపూర్ణముగా భిన్న
త్వమున్నది. అట్టిచో వన వర్ణన జరుగును. రెండు
సందర్భములలో వర్ణ్యమయినది వనమొక్కటియే,
కాని వర్ణనా పద్ధతియందు భేదముండవలసియుండును.
వారి వారి అప్పటి అనుభవముల కావనము, అక్కడి
దృశ్యములు ఎట్లు ఉద్దీపకము లయినవో, ఆ విధ
ముగా వర్ణన సాగవలయును. అ విధముగా కాక
వర్ణ్యము నందలి ఏకత్వమునే ఆధారముగా తీసికొని
ఉభయ సందర్భములయందు కూడ ఒకే విధమయిన
వర్ణన కాని, సందర్భమును, స్థితిని పూర్తిగా వదిలి
కేవల వర్ణనా ప్రధానముగా చేయు వర్ణనకాని కావ్య
మునకు అనౌచిత్య దోషమును కలిగించుచుండును.

సందర్భమున కనుకూలముగా వర్ణనల నుప
యోగించుకొను నేర్పుతోపాటు వానిని నిత్యనూత్న
ములుగా రచించు శక్తియు కవి కలిగియుండవల
యును. లోకము వలనగాని, పూర్వుల రచనల
వలనగాని వర్ణనలు అతి పరిచితము లయినప్పుడు,
వాని నదేవిధముగా వర్ణించుట వలన సహృదయు
నవి ఆకర్షించలేవు. అప్పుడు వర్ణించుటలో నూత్న
మైన పద్ధతిని స్వీకరించి వర్ణ్యమును క్రొత్తదానివలె
భాసింపచేయవలసి యుండును. ఇట్లు చేయుటకు
ఊహాశక్తి, పరిశీలనాశక్తి, ఉక్తివైచిత్రి మొదలగు
నవి అవసరమగును. అలంకారము లన్నియు

ఉక్తిపై చిత్రి నాశ్రియించుకొనియే ఏర్పడినవి. ఈ అలంకారములను కూర్చు శక్తి వర్ణనమునందు సామాన్యముగా నూత్నత్వమును ఆభాసింపచేయును. పరిశీలనాశక్తియు, ఊహాశక్తియు దానికి తోడుగా నున్నచో వర్ణనలు పరమోత్కృష్టములయి సహృదయ హృదయ రంజకములగును. ఇందువలననే ఈ శక్తిత్రియమునకు వర్ణనల విషయమున అత్యధిక ప్రాధాన్యము కలిగినది. వర్ణనా నైపుణ్యమును వీని వలననే కలుగుచున్నది.

కావ్యములయందు కథ చెప్పునప్పుడు ఉపయోగించునట్టి భాషయొక్క స్వరూపమునకు, వర్ణనలయందు ఉపయుక్తమగునట్టి భాషయొక్క స్వరూపమునకు భేదము కనుపించుచున్నది. భాషయొక్క ఉపయోగము, పాత్రలయొక్క స్వభావము, విషయము యొక్క స్వభావమునుబట్టి మార్పు చెందుచుండును. లోకమునందా యా సందర్భములందు భాషయొక్క ఉపయోగములో భేదము కనిపించుచునే ఉన్నది, కాని సర్వసందర్భములందొకే విధమయిన భాషయొక్క ఉపయోగము జరుగుట లేదు. ఈ పద్ధతియే కావ్యములందును ప్రవేశించినది. ఆ యా విషయములను చెప్పునప్పుడు, తదనుగుణముగా సాగుట యన్నది కావ్య సౌందర్యమును పెంచును. అట్లు కాక సర్వత్ర ఒకేవిధమైన శైలి నాశ్రయించుట, ఆ శైలివరకది అందముగనే ఉండవచ్చును గాని విషయానుగుణ్యము లేనందున అనౌచిత్యవంతముగా అగును. ఈ భాషయొక్క ఉపయోగించుటలోని భేదముల వలననే భావమునకు అభివ్యక్తీకరణ సరిగా జరుగును.

వర్ణనల యందలి భాష, కావ్యప్రయుక్తమయిన ఇతర సందర్భములలోని భాషకువెక్కువ భిన్నముగా నుండుటకు కారణము, వర్ణనల కవసరమని చెప్పబడిన ఊహ, పరిశీలనా, అలంకార ప్రయోగ శక్తిత్రియము. వస్తు విషయములను బట్టి, దానికి సంబంధించిన ఊహయందు సౌకుమార్యాదులు కలుగును. వీని ననుసరించి, వీటి కధిక ప్రాధాన్యము వర్ణనలయందున్నది కావున, భాషయందు భేదము తప్పనిసరిగా సంభవించును.

లోకమునందు శబ్దమునందు లేని కొన్ని భావములు కంఠస్వరము వలన, అంగ వికారాదులవలన సంభాషణలయందు, మాట్లాడుటయందు, కల్పించబడుచున్నది. కావ్యమున నిట్లు కల్పించుటకు వీలు లేదు. అందువలన, కావ్యమునందు విశేష భావ వ్యక్తీకరణ చేయుట కొరకు అక్షర, పద సంఘటనము ఉక్తిపై చిత్రి మిక్కిలిగా గ్రహింపబడును.

ఒక సుకుమారమైన వస్తువును వర్ణింపవలసి వచ్చినప్పుడు కేవల శబ్దములవలన కలుగు నర్థముపైన నాధారపడుటయేకాక, సుకుమార పద, వర్ణ సంఘటనమునందు నేర్పు చూపించి, కవి ఆ వస్తువును గూర్చి సహృదయునకు అధికముగా బోధ గలిగించును. దుఃఖ మొక్కటియే, కాని అది కలుగుటకున్న కారణములలో వైవిధ్య ముండవచ్చును. అయినప్పుడు దప కలిగించినది దుఃఖమే యన్నది వానియన్నింటికి సాధారణమే అయినప్పటికీ, ఆ కారణముల యొక్క స్వరూపము ననుసరించి వర్ణించునప్పుడు ఆ భావమున కనుగుణముగా భాష ఉండవలయును. లేనిచో వర్ణన చేయుట వలన కలుగవలసిన ప్రయోజనము కలుగకపోవలసివచ్చును. కావ్యమర్మజ్ఞుడయిన కవి వర్ణ్యమునుబట్టికాక వర్ణన చేయునప్పటి స్థితి ననుసరించి భాష నుపయోగించి కావ్యసౌందర్యము నధికము గావించును.

# లోలోపలి ఆలోచన

ఒకానొక లిప్తయందు జరిగిన యొక పరమాల్ప కార్యము అనంతర ఫలితమునందెంత వైశాల్యము భజించుచున్నది. లోకుల కామవ్యాపారమున కొక తలయు తోకయు లేదు. ఈ లేకపోవుటయు మహా విషయమని వాదించువారు లేరా? నియమము లేని జీవనమునందు సుఖ భ్రాంతి కలిగిన జను లనేకులున్నారు. ఎవని లైంగిక భావము పశుత్వస్థాయిని దాటలేదో వాడు జారుడగును. వాని కది వట్టి శరీర సంబంధమైన క్రియ. ఒకానొక చిత్తవృత్తి విశేష విరహితమైన కేవల శారీరక కర్మకు రసత్వస్థాయి నందుకొనుటకు వీలున్నదా? తజ్జారభావసమర్థనకై వ్రాయబడు గ్రంథములకు కావ్యత్వ స్థితి యున్నదా?

లోకమునం దెందరు జారులులేరు? స్వభార్య యొక్క పరపురుష సంబంధము కోపహేతువై ఆ పురుషుని హత్యచేసినవా రెంతమంది లేరు? ఒక్క నానావతి విషయముననే యీ విస్తృతి యెందుకు? హత్యాకాలమందలి యా లిప్త కంత బలముండి యుండవలయును. ఒకే రకమైన కార్యము ఫలమునం దొకప్పు డల్పమై మరియొకప్పు డధికమగు చున్నది. అధికార మదాంధు లెంతమంది యెన్ని యన్యాయములు చేయుటలేదు? ఒక్క చాణక్యుని జుట్టు పట్టుకొని పీకుటయే యొక రాజవంశ నిర్మూలనమునకు హేతువైనది. అంతకన్న యధిక దుష్టముగా గనిపించిన కార్యములు కాలేదు. కార్యము యొక్క యల్పత్వాధికత్వములకు ఫలముయొక్క యల్పత్వాధికత్వములకు సంబంధము లేకుండ నున్నది. సర్వము సష్టిపేళ నాశ్రయించియున్న దేమో: "లలితంబై చను కాలమం దనుకూల స్పందనం బేచువేళ లవిజ్ఞాతములై చనున్." మానవుడు ప్రతిక్షణ వ్యగ్రుడు కాగలడా?

కవిత్వము నారాధింతురట. ఆరాధించుట యేమిటి? ఉపాసన నుపాసించుట యుండునా? ఉపాస్యమైనదేదో యొక దేవత. ఈ యుపాసన తదారాధనకైన యొక మార్గము. ఔను మరి. ఆరాధ్య వస్తువు మరేదో యుండవలయును. ఈ కవిత్వము దానిని గురించిన యుపాసన కావచ్చును. తపస్సు కావచ్చును. దానిని వహించు పల్యంకిక కావచ్చును. కవితపల్యంకికా వాహకుడు కావచ్చును. ఒకానొక ప్రేరణ ననుసరించి కవిత్వము కవిలో నుండి పుట్టుచున్నది. అది వాని సంతానము. తన సంతానమును తానే యారాధించునా? ఏమో!

నిస్సారమైన సంసారమును గురించి తెగ యూహించి మనస్సు చెడగొట్టుకొనిన వాని నిర్జీవాస్థులలో కూడ యొక సన్నని కదలిక గలిగించ గలిగిన శక్తి యామె యందమున కున్నది. ఆమె పరమాధునికురాలు. ఆ వేష మామెకు సరిపోయినది. 'కిమివహిమధురాణాం మండనం నాకృతీనాం' అన్న దాని నటు త్రిప్పి యామెను గూర్చి ప్రయోగింపవచ్చును. ఈ దేశములో స్త్రీ యందమును గూర్చి మాటాడుట కష్టమైన వ్యవహారము. ఒక ప్రతిభాశాలితో యాయన ప్రతిభను గురించి మెచ్చికోలుగా మాటాడవచ్చును. అందకత్తెయైన స్త్రీతో నామె యందమును గురించి మాటాడుటకు వీలులేదు. స్త్రీలను కూడ నారాధింతురట. ఈ యారాధన యేమిటో? 'సెకండ్ సెక్స్' వ్రాసిన యామె వ్రాసినది. స్త్రీలను దేవతలుగా చూడవలసిన యక్కరలేదు. మానవులుగా జూచినచో చాలునని.

లక్ష్యము వేరు. తల్లక్ష్య సాధనా మార్గము వేరు. కవిత్వము లక్ష్యమా? లేక లక్ష్యసాధనా మార్గమా? కవిగా కీర్తి సంపాదించుకొనుటకై

వ్రాయవచ్చును. ఎవరినో సంతోషపెట్టుటకై వ్రాయవచ్చును. ప్రచారమునకు వ్రాయవచ్చును కాదు. పరమేశ్వరార్పణముగా వ్రాయవచ్చును. అన్నిచోట్ల లక్ష్యము వేరు వేరుగా కనపడుచున్నది. దీని నెవ్వ డారాధించును. కళ కళకొరకే యన్న నిర్జీవ వాదమునుండి ఈ యారాధనయన్న నినాదము పుట్టి యుండవచ్చును.

ఒకడు ధనవంతుడు. మరొకడు కీర్తిమంతుడు. ధనముగల వానిని లోక మాశ్రయించుచున్నది. కీర్తిగలవానిని గౌరవించుచున్నది. ధనవంతుని యందు కొంత విరోధ భావము లోకమున నుండకపోదు. కీర్త్యాశ ధనాశకన్న తక్కువదా? ధనమునకై గడ్డికరచు వాడున్నచో కీర్తికై గడ్డి కరచు వాడు కూడ నున్నాడు. ధనము నెగజిమ్మి యొకడు కీర్తిని కొనుచున్నాడు. వానికి ధనమక్కర లేదు. కీర్తి కావలయును. భేదమెక్కడ? ఇరువుర కేదో యొకదాని యక్కర యుండనేయున్నది. ఏ యక్కరయు లేనివాడు మహానుభావుడు కావచ్చును. ధనము మనకు నిత్యావసరమైన వస్తువు. కీర్తి యున్నచో లాభము. లేనిచో నష్టములేదు. ధనము కూడబెట్టినవాని యందు విరోధ భావము వహించుటలో మనకింత యవసరమైన వస్తువు వాడు మూట గట్టుకొని యుండుట యేమన్న యసహనము లేకపోలేదు.

ఔత్కృష్ట్యము వ్యక్తి నాశ్రయించియుండును. మంత్రి, కవి, అధికారి, వ్యాపారస్థుడు, మరొకడు, వీరధములు కావచ్చును. పాకీవా డుత్తముడు కావచ్చును. వర్ణములను బట్టి సమాజములో నెక్కువ తక్కువ లుండకూడదు నిజమే. వృత్తిని బట్టి యుండవలయునా? వర్ణగతాహంకారము చెడ్డది. వృత్తిగతాహంకారము మంచిదా? రైతులు సర్వలోకముల కన్న ప్రదాతలని చెప్పుదురు. వాడు లోకమున కన్నము ప్రసాదించుటకై సేద్యముచేయుచున్నాడా? దేశ సేవకై మంత్రిత్వము చేయుట యెటువంటిదో, పరుల కన్న ప్రదానమునకై వ్యవసాయము చేయుట యటువంటిది. ధాన్యము ధర పెరిగినకొలది నాకు గలిగెడు సంతోషము నాకు దెలియును.

పూర్వ సమాజములో స్త్రీ బానిస. నవ సమాజములో నేమి? స్త్రీ శరీరము నేడు వ్యాపార వస్తువు. వేశ్యల సంగతి కాదు. వారెప్పుడు నున్నారు. అడ్వర్టయిజ్‌మెంటుకు మిక్కిలిగా పనికి వచ్చునవి నగ్నస్త్రీ చిత్రములు. పెద్ద పెద్ద పట్టణములలో పరమ నవీన పద్ధతులపై నడుపబడు హోటళ్లలో కొందరు స్త్రీలచేత నృత్యము చేయింతురు. ఉపకంచుకార్థాంశుక మాత్రాచ్ఛాదిత వక్షోజఘన భాగలైన వారు తమ శరీరమునందలి వంపులను రకరకములుగా ప్రదర్శింతురు. మొదటివారు ఆపాద మస్తకము ఆచ్ఛాదనములతో వత్తురు. తరువాత నొక్కటొక్కటిగా వస్త్రములు విసర్జింతురు. చివరిపొర మిగిలినప్పుడు దీపము లారిపోవును. వక్షోజఘనముల కత్తుకొనియున్న యా వస్త్రములు చీకటిలో మెరయుచుండును. చీకటిలో వారవియు విసర్జింతురు. ఆ క్షణమందలి యా పరమ నిశ్శబ్దములో కొన్ని నిట్టూర్పులు వినవలయును. మరల దీపములు వెలుగును. చీకటిలో మెరియజాలనివి, వారి దేహమువంటి వర్ణములు గలవి, వస్త్ర ఖండములు ఆ యా భాగముల నంటియుండును. అప్పుడప్పు డవియు నుండవు. ఈ పురుషర్షభు లప్పుడు ప్రశంసగా చప్పట్లు చరతురు. ఇది స్త్రీని గౌరవించుట.

ప్రధానమైనవి కామ క్రోధాదులు. అవి సర్వ దౌష్ట్యమునకు జన్మస్థానములు. అవి సుడిగాలి ముద్దలవలె మానవుని మనస్సులో జొరబడి గిర గిర తిరిగి బాధపెట్టును. వానిని నియమించుటయందున్ముఖమగుట శాంతి సంపాదనకైన తొలిమెట్టు.

— జువ్వాడి గౌతమరావు.

## చర్చా వేదిక

### వసంతసేన — మధురవాణి.

జయంతి 15 వ సంచికలో శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు వసంతసేన కీడైన ఉదాత్త నాయికలను ఆంధ్ర సాహిత్యములో వెదకుతూ "ఆంధ్ర సాహిత్యములో గురజాడవారి కన్యాశుల్కములో మధురవాణి కనబడుచున్నది. ఇటువంటిదే చింతామణి కూడ" అని సెలవిచ్చారు. ఆ తరువాత ఇంకా ఏమి శలవిచ్చారంటే "కాని ఆమె శీలము మొదటినుండి వసంతసేనవంటిదికాదు. మధురవాణి సత్కులములో పుట్టినది. వసంతసేన వేశ్యా కులములో పుట్టినను ఎన్నడుకూడ ఆ కుల వృత్తిని తలంచనైనలేదు." శాస్త్రిగారికి మధురవాణి సత్కులములో పుట్టినదని ఏ దివ్యదృష్టి వలన గోచరమైందో తెలియదు. కన్యాశుల్కంలో ఎక్కడా మధురవాణి సత్కుల ప్రసూతయని చెప్పబడలేదు. సప్తమాంకంలో సౌజన్యారావుగారు మధురవాణి సౌజన్యమును గుర్తించి "నువ్వు మంచి దానివి. ఎవరో కాలుజారిన పురుషుడి పిల్లవై యుంటావు. ఈ వృత్తి మానిలేవా?" అని అంటాడు. దీనివల్లకూడ ఆమె సత్కుల ప్రసూత అని తేలుట లేదు. ఏమైనా వసంతసేనను మధురవాణితో పోల్చుట శాస్త్రిగారికి గురజాడమీదగల భక్తినే తెలుపుతున్నది. దీనికీ మృచ్ఛకటికము తర్వాత వచ్చిన మంచి నాటకము కన్యాశుల్కమొక్కటే అన్న ప్రబుద్ధుడి వచనాలకీ ఏమీ తేడా కనిపించటంలేదు. తప్పో, ఒప్పో, ఒకదాన్ని పట్టుకుని తీవ్ర ప్రచారం చేస్తే చదువుకున్నవాళ్ల దృష్టికూడా మందగిస్తుందనటానికి ఇది మంచి ఉదాహరణ.

మరి శాస్త్రిగారి మాటల ప్రకారమే మధురవాణి సత్కులంలోనే జన్మిస్తే ఆమె వేశ్యావృత్తి నవలంబించటం మరీ ఘోరమౌతుంది. అప్పుడు సత్కులంలో పుట్టి వేశ్యయైన మధురవాణికీ, వేశ్యల కులంలో పుట్టినా ఆ వృత్తినైనా తలంచని వసంతసేనకూ ఎట్లా పోలిక కుదురుతుంది? కన్యాత్వం చెడనిది వసంతసేన. విటుని తరువాత విటుని మారింది మధురవాణి. జాతిమాత్రసామ్యం దప్ప వీరికి మరెందునా సామ్యం లేదు. శాస్త్రిగారు ఆ జాతిలోనే సామ్యంలేదంటున్నట్టున్నారు. ఆ మధురవాణి గానీ, చింతామణి గానీ, శాస్త్రిగారు చెప్పక విడచిన కలభాషిణిగానీ వసంతసేన కెందునా సరిరాదు. అదేమైనా వ్యాసములలో తెలుపబడిన అభిప్రాయాలకు వ్యాసకర్తలే బాధ్యులుగాని పత్రికా సంపాదకుల బాధ్యత ఏమీ ఉండబోదనే సిద్ధాంతాన్ని జయంతివారు బాగా అమలులో పెట్టుతున్నట్లు తోస్తున్నది.

ఇది కేవలం అభిప్రాయాలకు సంబంధించిన సమస్య కాదు. అభిప్రాయాల్లో జోక్యం కలిగించుకోకపోవటం మంచిదని మీరనుకుంటే అభ్యంతరం లేదు. మధురవాణి సత్కులంలో పుట్టిందనటంలో రచయిత అశ్రద్ధ, అది సరైనా కాదా చూచుకోలేని సంపాదకుల అశ్రద్ధా గోచరిస్తున్నవి. సంపాదకుల అశ్రద్ధను గురించి జయంతిలోవ్రాసినంత తీవ్రంగా తెలుగు దేశంలో మరోచోట వ్రాసినట్టులేదు. మరి జయంతి సంపాదకులే ఇలాంటి అశ్రద్ధకు లోబడటం న్యాయంగా లేదు.

మధురవాణిని వసంతసేనతో పోలుస్తున్న చాలామంది ఆధునికులు మృచ్ఛకటికం చదువనేలేదు. వారి మాటలువిని అలా అనుకోవలసి వస్తున్నది. వసంతసేన వేశ్య అని వారికి తెలుసు. వేశ్యను కథానాయికగా చేశాడు కాబట్టి మృచ్ఛకటికా కారుడు గొప్పవాడు అని వారి అభిప్రాయం. వసంతసేన

పంటి దానిని నాయికగా చేయటం శాస్త్ర సమ్మతమే అన్న విషయం పాపం వాళ్లకు తెలిసి వుండదు. కాని శాస్త్రిగారు సంస్కృత సాహిత్యంలో గొప్ప పండితులు. ఆ అపండితులు మృచ్ఛకటికం చదువకుండా వసంతసేనను గురించి మాట్లాడినట్లు ఈ పండితులు కన్యాశుల్కం చదువకుండా మధురవాణిని గురించి మాట్లాడినారు అని అనుకోవలసి వస్తున్నది.

— మురారి.

## ఆకాశవాణి

ఈ మధ్య కొన్నాళ్లనుంచి విజయవాడ కేంద్రం "భక్తిరంజని" ప్రసారానికిముందు, ఉదయం, దేశభక్తి గేయం ప్రసారం చేయడం ప్రారంభించింది. ఈ ప్రసారం ప్రారంభించిన మొదటి రోజుల్లో, ఒకే గేయాన్ని దేశభక్తి గేయంగా, ప్రబోధ గేయంగా కూడా పేర్కొనేవారు, కాని ఇటీవల ప్రబోధాన్ని వదిలి దేశభక్తినే పట్టుకున్నారు. శుభం. ఏది దేశభక్తి గేయమో, ఏది ప్రబోధ గేయమో వారికి తెలిసినట్లు అగుపించదు. శ్రీ శ్రీ వ్రాసిన "మహా ప్రపంచం" గేయంలోని ప్రత్యక్షరమూ, అది ప్రబోధ గేయమని ఘోషిస్తూ ఉంది. ఉంటే దానిమాట వినేవాడు, ఆలోచించేవాడేవడు? దాన్ని దేశభక్తి గేయమనే అంటారు ఆకాశవాణివారు. ఇక నవకవి [illegible] "గాలులు రంగి, పాపలు రంగి," అన్న ఇంద్రగంటి వారి గేయం ఏ గేయమని వేరే చెప్పనక్కరలేదు. ఆ గేయంయొక్క ముఖ్య [illegible] [illegible]. దాన్ని కూడా [illegible] [illegible]. [illegible]

మురారి వారి "నవ సంధ్యా, యుగ సంధ్యా" అన్న గేయమూ దేశభక్తి గేయమే, ఇల్లా చూస్తే "గగనమంతా నిండి పొగలాగు క్రమ్మి" అన్న గేయంకూడా దేశభక్తి గేయమే... సర్వ గేయాలూ దేశభక్తి గేయాలే... ఏదో ఒక గేయం, ముత్యాల గేయమే కదా! అని దీనితో కొంత తృప్తి పడవచ్చు. కాని రాయప్రోలువారి పద్యాలను కూడా గేయాలంటారు ఆకాశవాణి వారు... ఆధునిక సాహిత్య అతిరథులూ, మహారథులూ, విమర్శకులతో నిండివున్న విజయవాడ కేంద్రం పద్య గేయాలలోని భేదాన్ని తెలుసుకోలేదా? అని ఆశ్చర్యపడవచ్చు. కాని అక్కరలేదు. వారికి అంత ఓపిక లేదు.

ఈ ఓపిక లేనితనంలో అభిమానం కూడా కలిస్తే చెప్పవలసిందేముంటుందిక. ఇటీవల రోజుల్లో ఒకే రచయితకు మూడుసార్లు అవకాశం ఇచ్చిన విషయం లోగడ ఈ శీర్షిక క్రిందనే "జయంతి" పాఠకులు చదివారు. రచయితను వదిలివేసి రచననే మూడుసార్లు ప్రసారం చేశారు విజయవాడవారే. నే [illegible] మధ్యాహ్నం మూడు గంటలకు ముచ్చట [illegible] మురారి గారి ప్రశ్నోత్తర ప్రసారం జరిగింది.

ఆ రచన పేరు "బొటన వేళ్లు". ప్రత్యేక ప్రసారంయొక్క అవసర మేమిటో తెలియదు మరి. ఆ నాడు శ్రీ శంకర భగవత్పాదుల జయంతి. ఈ నాటికకీ ఆ జయంతికీ ఏమీ సంబంధం లేదు. ఈ నాటిక మండపాక రాజేశ్వరశాస్త్రి గారిది. వారి రచనను ఆకాశవాణి వారు తమ కనుగుణంగా కుదించుకొన్నారు. తమ కుదింపు కాబట్టి అంతగా అభిమానం ఉండి ఉంటుంది. కాక పోతే ఆ రచయిత వ్రాసిన నాటికలు ఇంకా ఉన్నాయి. ఆ నాటికల విషయం కూడా సంగీత విషయమే. నాటిని ప్రసారం చేస్తే, అటు రచయితకూ. ఇటు శ్రోతలకూ లాభంగా ఉండేది. కాని ఈ ఊహ ఆకాశ వాణి వారికి లేదు. కొత్త నాటికోసం ఎవడు బాధపడుతున్నాడు. సిద్ధంగా ఒకటి ఉండనే ఉందిగా! ఊం ప్రసారం చేయండి, "నడిచిందే బండి" అన్నట్టుగా ఆకాశవాణి వారు ప్రవర్తిస్తున్నారు. ఏది ప్రసారం చేసినా కాలం గడుస్తుంది గదా! అనే దీలాసా అధికం.

శ్రీ శంకరుల జయంతి సందర్భంలో విశ్వనాథ సత్యనారాయణ గారి 'సర్వజ్ఞుడు' అనే నాటికను విజయవాడే ప్రసారం చేసింది. ఇదేమీ క్రొత్తదికాదు, పాతదే. దీన్ని ఎన్నాళ్లక్రితం రికార్డు చేసారో, తెలియదు. పూర్తిగా చెడిపోయింది. విన్నామనేదేతప్ప, ఏం విన్నదీ తెలియని స్థితి శ్రోతలకు కలిగింది. గరగరలు, గీరలు అతి. అన్నదే అనడం, అసలు స్థలాల్లో సరిగా వినరాకపోవడం ఈ 'రికార్డు' యొక్క ప్రత్యేకతలు. ప్రసారం చేసేముందు తామొకసారి విందామనే ఓపిక కూడా ప్రసారకులకు లేదు. వాళ్లకు బదులు శ్రోతలు ఓపిగ్గా వినవలసి వచ్చింది... నాటికను గూర్చి శ్రోతల్ని విముఖులుగా చేసేందుకు ఆకాశవాణివారు కనిపెట్టి అవలంబించిన కొత్త పద్ధతి ఇది.

శ్రీ శంకరుల జయంతి సందర్భంగా ఆ రోజు ప్రసారమైన కార్యక్రమం ఇదొక్కటేనని చెప్పవచ్చు. "భక్తరంజని" లో ప్రసారమైన లక్ష్మీనృసింహ స్తోత్రానికి ఇదే సందర్భం కానక్కరలేదు, అమరవాణి సంస్కృత కార్యక్రమం. బహుళ శ్రోతలకు లాభం కలిగించేది కాదు... ఇక ఆ రోజు భగవద్రామానుజుల జయంతి కూడా. ఈ జయంతినిగూర్చి ఆకాశవాణి ఏ కేంద్రంవారు కూడా అధరస్పంద మాత్రమైనా చేయలేదు.

మరి మే 8 వ తేదీన రవీంద్రుని జయంతి. ఆ రోజున హైదరాబాదు కేంద్రం రవీంద్రునితో నిండిపోయింది. స్త్రీ, బాల, గ్రామస్థుల, నగరవాణి కార్యక్రమా లన్నింటినీ ఆక్రమించింది ఈ జయంతి సందర్భం. అంతేకాకుండా ప్రత్యేకంగా రవీంద్ర గేయానువాదాలూ, వ్యాఖ్యలూ, నాటిక కూడా ప్రసారం చేయబడ్డాయి. రవీంద్రుని గూర్చి ఇంతగా ఘోషించిన హైదరాబాదు కేంద్రం, అంతగానే ప్రతిఘోషించిన విజయవాడ కేంద్రం కూడా శ్రీ శంకరుల విషయంలో కొంచెంగా, రామానుజుల విష

యంలో ఆ కొంచెంకూడా లేకుండా శబ్దించి
కిమన్నాస్తిగా ఊరుకున్నాయి. దీనికి
కారణం అంత తేలిగ్గా బోధపడదు. ఆ యా
కేంద్రాలలో శంకర రామానుజులయందు
భక్తిభావం, కనీసం అభిమానమైనా సరిగ్గా
ఉన్నవారు లేరుగదా! వారిని గూర్చిన
ప్రత్యేక ప్రసారాలవల్ల జరిగే లాభంకూడా
ఏమీ లేదుగదా! అన్నట్టు మన రాజ్యాం
గంలో మతానికి ప్రాధాన్యం లేదుగదా.
మరి అధికంగా ఎందుకు ప్రసారం చేయాలి?
... ఇల్లా ఉంది ఆకాశవాణి వారి ప్రసార
తత్వ స్వరూపం.

విశ్వామిత్రుని కథ విన్నారా? ఆయన
మేనకకు కొంతకాలం లొంగిపోయినాడు.
తాత్కాలిక మనోదౌర్బల్యం అందుకు
కారణం. ఏప్రిల్ 24 న నగరవాణి కార్య
క్రమంలో ఆ విశ్వామిత్రుడు ఆధునిక
ప్రేమ తత్వవాదనలో మేనకకు ఓడిపోయి
మరీ లొంగిపోతాడు. స్వర్గంలో పాత్రలు.
ఇంద్రుని ప్రతిపక్షి- ప్రజానాయకుడు- బృహ
స్పతి. ఇంద్రుడు వట్టి బూర్జువారాజు ...
ఇదంతా పూర్వ గాథలను ఆధునిక పద్ధతిలో
మలవడం. అభ్యుదయదృష్టికోణంలో పురా
ణాలను పరిశీలించడం. ఆధునిక యుగాన్ని
పూర్వగాథల్లో ప్రతిబింబింప చేయడమంటే
ఇదే కావచ్చు... విశ్వామిత్రుడు ఎల్లా సద్గ
తిని- మేనకా మోహాన్ని వదిలించుకు- పొం
దాడో ఈ 'మేనక' నాటికా రచయితకు
అవసరం లేదు. విశ్వామిత్ర పాత్రలోని
ఔచిత్యాన్ని చెడగొట్టడం మాత్రం జరిగింది
...కాక ఇదే పద్ధతిలో తిరిగి 'మేనక'కు అను
బంధంగా 'విశ్వామిత్ర' కూడా రావూరి భర
ద్వాజ గారు వ్రాస్తారేమో! పూర్వగాథల
అంతర్యాన్ని వదిలివేసి ఆ గాథల్ని అస్తవ్య
స్తంగా చిత్రిస్తే, ఆకాశవాణివారు ప్రసారం
చేయడం- వారికి వాటి విషయంలో ఎల్లాంటి
అభిప్రాయా లున్నాయో తెల్పుతుంది. భార
తీయ'బహుజనహితాయ' మాత్రం ఇదికాదు.

జన శ్రుతి అనుసరించి కథలు, నాటి
కలు వ్రాయడం హర్షించ దగిందే. ఆ పద్ధ
తిలోనే ఈ మధ్య "జ్యోత్స్నాభిసారిక" అనే
నాటిక ఏప్రిల్ 27న విజయవాడ ప్రసారం
చేసింది. అయితే అందులో జ్యోత్స్న ఉంది
కాని అభిసారిక మాత్రం లేదు. ప్రియుని
కోసం సంకేత స్థలానికి వెళ్ళే శృంగార నాయి
కలలో అభిసారిక ఒక నాయిక. ఈ అభిస
రణం ఇందులో లేదు. ఈ నాటికలోని శిల్పి
తన సౌందర్యవతియైన కుమార్తెను, నాట్య
ప్రవీణను దేవదాసిగా చేయాలనుకుంటాడు.
అది ఇద్దరు అయ్యలన్నల (వాళ్లు అమ్మలక్కలు
కారు) వల్ల చెడిపోతుంది. లేని దోషాన్ని
కూతురుమీద మోపి, తండ్రిని భ్రాంతింపజేసి
అతని చావుకు కారణమౌతారు. ఈ అయ్య
లన్నల వాచికం మరీ దుర్భరంగా ఉంది.
వాళ్లె పాత్రలు నీచ పాత్రలే కావచ్చు.
అంతమాత్రంలో వారికి అనాగరక సంభాష
ణలు కల్పించడం కాని, కంఠస్వరాన్ని అంత
అవహేళనాపూర్వకంగా కూర్చడంగానీ నాటి

కను ఏమాత్రం న్యాయం కలిగించదు. సంగీతం ఆకాశవాణివారికి సాధారణమైన పద్ధతిలోనే ఉంది. విజయరాఘవ రచన.

మే 4 న ప్రసారమైన "రాగబంధం" అనే నాటిక ఉన్నంతలో బాగాఉన్న నాటిక. కథా విషయం దాదాపు "ఆమెకోసం" అన్న వింజమూరివారి పూర్వం ప్రసారమైన నాటికా విషయమే. కాని నిర్వహణం ఇందులో బాగా జరిగింది. కాకపోతే ప్రధాన నాయికా పాత్ర అనవసరంగా ఎక్కువగా ఆవేదనా ప్రదర్శనం చేసింది అంతే. వాచికం నాటికకు న్యాయమే కల్పించింది.

మే 9 వ తేదీన రసమయిలో 'సంగీత రసాస్వాదన- శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారితో పరిచయం' ప్రసారమవుతుందని 'వాణి' చెప్పింది. కాని సరిగ్గా ఆనాటికి అది మారింది. అదివరకే సిద్ధంగా ఉన్న జటావల్లభుల పురుషోత్తంగారి "సంస్కృత నాటకాలలో సఖీపాత్ర" అనే ప్రసంగం విజయవాడ ప్రసారం చేసింది. మళ్లీ ఏదో నాటిక ప్రసారం చేయకుండా ఒక మంచి ప్రసంగం ప్రసారం చేయడం విజయవాడ వారికి "జన్మకు శివరాత్రి" వంటిది. శ్రోతలకు కూడా. అప్రధాన పాత్రలుగా కన్పించే సఖీ పాత్రల ప్రయోజనం సంస్కృత నాటకాలలో ఎల్లా ఉపయోగించుకోబడిందో, ఈ ప్రసంగంలో వివరించబడింది. సంగీత సంచికలవంటి వాటికి రసమయిలో స్థానం ఇచ్చి ఎక్కువకాలం కేటాయిస్తారు కాని ఇల్లాంటి ప్రసంగాలకు సమయం అధికంగా ఇవ్వడం ఆకాశవాణి వారికి ఆనవాయితీ లేదు. అందువల్ల ఈ ప్రసంగం చాలా సంక్షిప్తీకరించబడింది అని అనిపిస్తుంది.

నాటికలూ, సంగీత కార్యక్రమాలూ విడి విడిగా అనేకంగా ప్రసారం చేయబడుతున్నాయి. వాటికి ప్రత్యేకంగా కాలం ఎల్లాగూ నిర్ణయించబడే ఉంది. మరి కేవల సాహిత్య ప్రసంగాలకోసంగా నిర్ణయించబడిన ఈ "రసమయి" "సాహిత్య నందిని" కార్యక్రమాలలో మిగతా వాటిని చేర్చడం ఎందుకో తెలియదు. ఆకాశవాణికి అది అలవాటు మాత్రమే అనుకోవాలి.

మే 3 న "సాహిత్య నందిని"లో తాపీ వారి "జానపద సాహిత్యంలో కథాకథనం" అన్న ప్రసంగ వ్యాసం చదువ బడింది. దీనిలో కథాకథనంలోని విశిష్ట లక్షణాలు మాత్రం చెప్పబడలేదు. కొన్ని జానపద గాథల కథలు మాత్రం ఎక్కువగా చెప్పడం జరిగింది. వ్యాసం చదివేముందు ఆ చదివే వారు ఒకటి రెండు సార్లయినా చదువుకోక పోవడంవల్ల అడ్డంకులు అధికంగా వచ్చినవి.

ఈ ముందు చదువకపోవడం అనేది ఒకొకప్పుడు ప్రసంగాన్ని వినే శ్రోతలకు చాలా బాధ కలిగిస్తుంది. మే 3 న "పేరంటం" స్త్రీల కార్యక్రమంలో "మహిళా మణులు: గంగాదేవి" అన్న ప్రసంగం అల్లా బాధ కలిగించింది. ఆ ప్రసంగంలో చాలా వరకు సంస్కృత శ్లోకాలు ఉన్నవి. ఏ ఒక్క—

శ్లోకం కూడా కనీసం అయిదారు తప్పులైనా లేకుండా చదువబడలేదు. మరి ప్రసారం చేసేప్పుడు తమ శాధ్యతను తాము గుర్తించక పోవడమనేది ఆకాశవాణి వారికి తీసివేయరాని లక్షణం అయిపోయింది.

"ఇంట్లోనాశత్రువులు" అన్న ప్రసంగం మే 18 న హైదరాబాదు కేంద్రం ప్రసారం చేసింది. రచించినవారు కృష్ణశాస్త్రి గారు. చదివింది మరొకరు. ఎల్లాగైతే ఏం. హాయిగా చదివారు. కాకపోతే ప్రసంగమే కృష్ణశాస్త్రిగారు వ్రాయవలసిన ప్రసంగం కాదు. ఇది కేవలం హాస్యాన్ని కల్పించడానికి మాత్రమే వ్రాయబడి ఉంటుంది. దీనిలో నల్లులూ, ఎలికలూ, ఇంకా అనేకమైన క్రిమికీటకాదులు ప్రవేశిస్తాయి. బలవంతంగా హాస్య రచనకు పూనుకుంటే బలవంతంగానే నవ్వవలసి ఉంటుంది తప్ప నిజంగా ఆ హాస్యం వల్ల నవ్వవలసిన స్థితి శ్రోతలకు కలుగదు. హాస్యానికి ముఖ్యంగా కావలసింది వాక్చమత్కృతి. మరి అదే లేకుండా ఇది వ్రాయబడింది. మరి హాస్యం ఎల్లా ఉత్పన్నమవుతుంది ?

అఖిల భారత స్థాయిలో అర్వైయేండ్లు నిండిన కవి ఎవరో తెలుసునా ? ఆయన సుమిత్రానందన్ పంత్ గారు. హిందీ కవి. ఆయనకు మే 20 న అర్వై యేండ్లు నిండినవి. ఆయన అర వై యేండ్ల స్మృతులు నాలుగు భాగాలుగా సర్వాకాశవాణి కేంద్రాలు తమ తమ ప్రాంతీయ భాషల్లో నాలుగు వారాలు ప్రసారం చేసుకొన్నవి. ఒక విధంగా జాతీయ కార్యక్రమంగా ఇది జరిగిందన్నమాట. హిందీ భాష భారతీయ భాషల్లో ఒక భాష. అంతేకాని దాని ప్రత్యేకత యేమీ లేదు. అది రాజభాష అయిందంటే దానికి ఇతర కారణాలు అనుకూలించాయి. హిందీ భాషలోని కవికి ఆకాశవాణి ఈ ప్రత్యేకత కలిగించడం హిందీ వైపు మొగ్గు చూపడమే అవుతుంది. ఇతర ప్రాంతాలలో షష్టిపూర్తి జరిగిన మహాకవులు లేకపోలేదు. వారికీ ప్రత్యేకత కల్గించబడలేదు. దానికి కారణం వారు హిందీవారు కాకపోవడం. అఖిల భారత స్థాయికి వారందుకోలేక పోవడం. ఆ అందుకోవడానికి వేరే చాలా కారణాలుంటాయి. అందువల్ల ప్రాంతీయులకు ఆ అవకాశం కలిగే వీలు లేదు.

ఈ పద్ధతి హిందీభాషయొక్క, హిందీ జనులయొక్క ఆధిక్యాన్ని ఇతర భాషీయుల మీద బలవంతంగా రుద్దడమే అవుతుంది. ఈ రుద్దడం అనేది ఇతరత్రా అనేక పద్ధతుల్లో జరుగుతున్నా, ఆకాశవాణిలో కూడా దీన్ని ప్రవేశపెట్టడమనేది, ఇతర భాషీయులయొక్క అవకాశాలనూ, ప్రత్యేకతలనూ త్రోసి రాజనడమే అవుతుంది. ప్రాంతీయ ఆకాశవాణి శాఖలవారు దీని విషయం ఏమైనా ఆలోచించారా? ఎందుకు ఆలోచిస్తారు. దీనివల్ల వారి స్థితికి ఏమీ లోపం ఉండదుగదా !

— సామీరి.

# గ్రంథ సమీక్ష

## మేల్కొన్న ఆకాశం—

## మనోభూమికలు—

తెనుగు సాహిత్యంలో వచనగేయం యిప్పుడు బాగా స్థిరపడిపోయింది. శ్రీశ్రీ తరువాత వచ్చిన కొందరు ముఖ్యులైన కవుల కృషివల్ల దాని విశిష్టత అసందిగ్ధంగా ఋజువయింది. వచనగేయం ఉనికిని ఋజువుచేసే దశ గడిచి, యిప్పుడు దాని అభివృద్ధిని సాధించే దశ గడుస్తున్నది. ఈ దశలో వస్తున్న కవిత్వానికీ, లోగడ వచ్చినదానికీ ఒక ముఖ్యమైన భేదం వుంది. అదేమంటే— "మరోప్రపంచం" గేయంతో తెనుగు కవిత్వంలో ఒక మహావేశం, ఉద్యమ చైతన్యం ప్రవేశించింది. ఒక ఉద్యమాన్ని నిర్మింప బూనుకున్న ప్రజానీకం జయ జయ ధ్వానాలు చేసుకుంటూ, ఆవేశంతో తమ లక్ష్యమేదో నినాదాలతో లోకానికి తెలియజెప్పుకుంటూ, నగర వీధులగుండా ఊరేగింపుగా వెళ్ళుతున్నట్లు కవిత్వం నడిచింది. ఇప్పుడు— ఊరేగింపు పూర్తిఅయి, ప్రజలంతా ఎక్కడివా రక్కడ విడిపోయి, ముఖ్యులైన పది పన్నెండు మంది ఒకచోట చేరి, నిర్మాణాత్మకంగా చేయవలసిన పని ఏమిటని ఆలోచిస్తున్న సమయంలో యీ ఉద్యమం నచ్చని వ్యవస్థ ఏదో పోలీసులను పంపిస్తే, వారికి జడిసిపోయినవారు, క్షమాపణ వ్రాసి యిచ్చినవారు పోగా, మిగిలిన నలుగు రైదుగురి అకుంఠిత దీక్షలాగా. వచనగేయంలో ఆలోచనాత్మకము, నిర్మాణాత్మకమైన దశ నడుస్తున్నది. ఇప్పటి దశలో ఒక సౌలభ్యంవుంది. రాజకీయాలలో ఎవరెక్కువ విజాయితీ గలవారో తేలినట్లు, ఆలోచనలో భావనలో ఎవరెంత ఎత్తు ఎగురగలరో కొలుచుకోవచ్చు. ఈ దశ శ్రీశ్రీ రచనల రెండవ భాగంలో ప్రారంభమై యిప్పటి వరకు క్రమ వికాసం పొందుతున్నది.

ఈ దశలో రాస్తున్న వారిలో పేర్కొనదగిన రచయిత, వర్ధమాన యువకవి శ్రీ మాదిరాజు రంగారావు.

> "కండ్లు లేకపోయినా, మనకంటే దూరం
> చూడగలదు ఎత్తైన గాలిగోపురం
> పడగ విప్పి తోకపై నిలిచి ఆనందిస్తుంది
> చెవులులేని పాము, సంగీతం."

కండ్లూ, చెవులూ వుండికూడా తత్ప్రయోజనాన్ని పొందలేని వర్తమాన మానవ సంఘాన్ని యింతకంటే ఘాటుగా విమర్శించటం కష్టం. మానవుడి కంటే మట్టిగోడ నయమా ? కనిపిస్తే కాటేసే పాము నయమా ?

> "దేవతల్లా జన్మించి, రాక్షసులవలె జీవించి
> ప్రాణం విడిచేరోజు
> అంతిమ క్షణం మాత్రం మానవులం"

అన్నచోటకూడా నిశితమైన విమర్శశూలంగా గుచ్చుకుంటుంది.

23 ఖండికల సంపుటి "మేల్కొన్న ఆకాశం" అనే కావ్యం. ప్రతి ఖండికలో ఆలోచనాశక్తి, అనవసరపు టావేశాలకు లొంగనితనం కనిపిస్తుంది. ఈ కావ్యంలో రంగారావు ప్రతిచోటా సంప్రదాయానికి ఘట్టిగా ఎదురు తిరిగి మాట్లాడుతున్న వాడివలె కన్పిస్తాడు. మానవుణ్ణి గురించి మాట్లాడినప్పుడల్లా, ఆది మానవ సమాజంనుండి నేటి నాగరికత స్థాయి వరకు మానవజాతి పరిణామశీలమైన పురోగమన

---

రచయిత: మాదిరాజు రంగారావు,
వెల రు. 1-25; 1-00. పేజీలు 64; 32.
రసధుని ప్రచురణలు
3-4-685 నారాయణగూడా, హైద్రాబాదు.

మార్గంలో పయనిస్తున్నదనే గాఢ విశ్వాసాన్ని వెలిబుచ్చుతూ. ఒక శాస్త్రీయ దృక్పథాన్ని ఆకళింపు చేసుకున్న వాడివలె పలుకుతాడు. మానవుణ్ణి గురించి వ్రాస్తూ,

"వ్యష్టి రూపాల సమిష్టి స్వరూపం
నైక శక్తుల సమాహారైక సూత్రం
సంస్కృతి విచిత్ర జీవ సంపుటి
యుగపరిణామ చిహ్నం మానవుడు."

పరిణామ శీలమైన సమాజంలోని మార్పును మరొకచోట చెప్తూ,

"మందే రాగడలా కొన్నాళ్ళు మతం
లోకాన్ని వెలిగించిన మాట నిజం
సూర్యోదయం ఎప్పుడో జరిగిపోయి
శిలల వృక్షాల జంతువుల మృగాల
నిజస్వరూప స్వభావాలు తెలిసిపోయి
మానవుని విద్యుదాహారశక్తికి
అతని ఐచ్ఛిక రూపాలుగా మారిపోయి
కాగడాల ప్రసక్తి ఆరిపోయిన సమయం."

అని వర్ణించాడు.

ఈ కావ్యంలోని 2 వ ఖండికలో దేవునితో టెలివిజన్‌లో మాట్లాడుతూ, 'దేవుడు' అనే భావన యొక్క పుట్టు పూర్వోత్తరాలను వివరించాడు కవి. "సృష్టికి ఆరంభదశలోవలె మృగాలకు దగ్గరగా బ్రతికే కాలంలో" భయంతో కూడిన గట్టి నమ్మకాలతో యీ భావన ఏర్పడిందనీ, ఆయన రూపకల్పనలను మలచడమే ముఖ్య ప్రయోజనముగా మారి చివరకు కళలు యాదార్థ్యాన్ని కోల్పోయాయనీ విమర్శించాడు.

"నిన్న అసంభవాలనుకున్నవి ఈ రోజుకు
పూజలతో ప్రార్థనలతో నిమిత్తం లేకుండా
రేపటికి ఆశ్చర్యం లేకుండా సంభవించడం
ఇరవయ్యో శతాబ్దం కాలం లక్షణం.... "

అంటూ కాలాన్ని దేవుడుకూడా నియమించలేడనీ, ఆయన సైతం కాలానికి తల ఒగ్గక తప్పదనీ ప్రతిపాదిస్తాడు. అయితే యిదేదైనా నాస్తికవాదమా అంటే కాదు. చివరకు అనిపిస్తాడుగదా దేవునిచేత,

"నే నెవరినో నాకు
నీవిప్పుడు చెప్పేదాక తెలియదు
నిజం చెప్తున్నా విను
నీవే— అంటే మానవుడే దేవుడు!"

చాలా చోట్ల యీ కవి వేదాంతియైన కవిలా కనిపిస్తాడు. అంటే సంప్రదాయ సిద్ధమైన వేదాంతం మాట్లాడటం కాదు; మానవ జీవితం ఏమిటని స్వయంగా ఆలోచిస్తూ, మథనపడే కవిలా. ఈ లోచూపు యీ కావ్యం ప్రతి పంక్తిలో కన్పిస్తుంది.

"ఆకాశంపై వెలసిన ఇంద్రధనస్సు
కనిపిస్తుంది చాలామంది కంటికి
మనస్సులో విరిసిన ఇంద్రధనస్సు
చూడగలడా అనుకున్న ప్రతి మనిషి?"

ఈ కావ్యంలో మొదటి ఖండికలోని "వెలుగు సింహం" చర్యలు మనోహరంగావుంటాయి. అలాగే 14 వ ఖండికలో చంద్రుడు తనకు కలుగుతున్న నూతన అనుభవాలను విశదీకరిస్తాడు. మొత్తం మీద మకుటాయమానమైన ఖండిక 20. ఇందులో "నేను" "పుంజీభూత తుహినకాంతివలె" ఎక్కడ వుంటే అక్కడ వెన్నెల రాత్రి అని ప్రారంభించి, "ప్రాభాతారుణ జీవరేఖవలె" ఎంతవరకు యీ "నేను" పయనిస్తే అంతవరకు "దివాభోగ"మని చెప్తాడు. ఈ "నేను" రాత్రి అయినా, పగలైనా జాగ్రదవస్థలో వున్నప్పుడు సర్వ వ్యాప్తమై ప్రకాశిస్తుంది. నిద్రిస్తున్నప్పుడు మాత్రం అందులో నుండి ఒక రాక్షసుడు బైటికి వస్తాడు. అతనిని చూసి బెదిరి లోకం "నేను"ను ధ్వంసం చేయాలని చూస్తుంది. ఈ విధంగా మానసిక శాస్త్రం లోతుల్లోకి తొంగిచూడటం నవీనుల ప్రత్యేకత.

గాలి తెరల మంపులపై తుమ్మెద కాలిజాడలు, గుండెలోతు పొరలనుండి ఎగయు రాగమాలలు, పసి పాపల పెదవులపై వెలుగు నవ్వుల అలల గలగల లను మన కండ్ల ఎదుట రూపు గట్టించే యీ కవి వచనగేయం చక్కగా రాస్తూ రాస్తూ, మధ్యలో మళ్లీ ఏదో గుర్తువచ్చి పద్యం రాస్తున్నవాడివలె గ్రాంధిక శైలికి తిరుగుతాడు.

"ప్రతిక్షణం ప్రత్యణువణువు
పరస్పర సన్నికర్షణము నొందుచు
శైలీరూపమునొందు అదృశ్యమాన
జీవిత సమాధిని కదలించే గాలులు"

'వదలబడిన అస్త్రంలా', 'చాచబడిన రెక్కలతో' మొదలైనచోట్ల 'బడు' చాలా బాధగా వుంటుంది. వదలిన అస్త్రము, చాచిన రెక్కలంటే తెనుగుకు చాలు.

సంస్కృతపద బాహుళ్యంతో, పరిపక్వంకాని భావనతో రాసిన తొలిరోజుల్లో, మాదిరాజు అన్వయం కాని కవి అని ఒక ప్రథ వుండేది. ఈ కావ్యంలో ఆ బాధ లేదు. నేను అనుకుంటాను, భావన పరిపక్వమైనకొలది అయోమయం తొలగిపోతుందని. ఎందుకంటే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి వంటి సమాస పటుత్వంగల కవులలో, మాట తెలియకపోతే నిఘంటువు చూసి తంటాలు పడవచ్చు. కాని ఆధునికులను కొన్నిచోట్ల పట్టుకోవడం చాలా కష్టమై, యీ అయోమయత్వం, ఆధునిక కవిత్వానికి వ్యతిరేకంగా చేసే వాదనకు ఆలంబనమయ్యే ప్రమాదం వుంది. అర్థకాఠిన్యం—అంటే అన్వయ క్లిష్టత—కావ్యంలో క్షమించరాని దోషము. "నా భావన నాది" అంటే 'భావకవుల' రోజుల్లోనే ప్రజలు వినలేదు. యిప్పుడు అసలు వినరు. ప్రజల మాట దేవుడెరుగు, పండితులైనా ఆనందించాలిగదా!

—సందుత్రి.

ఆధునిక కవితలో వచ్చిన కొత్తమార్పు—చాలా ప్రధానమైనదీ— కవిత్వాన్ని కేవలావేశం నుంచీ, వైయక్తికమైన అనుభూతుల పరిధులనుంచీ దూరంగా ఉజ్జ్వలమైన సంప్రదాయమూ, అత్యాధునిక శాస్త్రీయ దృక్పథమూ, సమస్త మానవ శ్రేయో భావనా కలిగిన నూతన మార్గం. ఇందుకే అభ్యుదయ కవిత్వం తనకుతాను భరతవాక్యం పలుక్కొని ఈ కొత్త మార్గానికి చోటిచ్చింది.

ఈ మార్గంలో ఒక్క ఛందో మార్గానికి ప్రాధాన్యం లేదు. భావానుగుణమైన, శిల్ప సమన్వితమైన యే రచన అయినా అభివ్యక్తి ననుసరించే ఛందస్సును యెన్నుకుంటున్నది. ఛందోబందోబస్తులన్నీ తెంచేయమన్నవాళ్లూ యివాళ్ల కొత్తగా ఛందస్సు కోరడంలో యిదే తాత్పర్యం.

ఈ మార్గం ఒకవేపు కావ్యరీతిలో, ఒకవేపు ఖండికా రీతిలో సాగుతున్నది. కావ్యగతంగా పాత్రల అంతర్యం తీర్చడంలో, ఖండికలలో వైయక్తికమైన అనుభూతిగా వ్యాఖ్యానించడంలో యెక్కువగా వ్యక్తమౌతున్నది. ఆధునిక శాస్త్రీయమైన వ్యాఖ్యానాలు, అనుభూతికి సమన్వయం చేయడం వైయక్తికమైన పద్ధతిలో చేసేప్పుడు కావ్యంలోకన్నా యెక్కువ అవకాశం ఉన్నది. కాని దీనిలో అస్పష్టత యేర్పడే ప్రమాదం లేకపోలేదు.

ఈ ఖండికారీతిలో జరిగిన రచనా మార్గంలో విశిష్టమైన అభివ్యక్తితో కవిత్వం రాసేవాడు మాదిరాజు రంగారావు. ఈయన వ్రాసే కవిత ముక్తచ్ఛందో రచనకు కొంచెం దూరంలో ఉంటోంది. సాధారణంగా ఈ మార్గీయులు అంత్యానుప్రాసకు

సంభాషణకు దగ్గరగా ఉండే సూటిగా చెప్పే లక్షణం పెంచుకున్నారు. ఈ రెండో లక్షణంతో కవిత వచనమే అయ్యే ప్రమాదం కలుగుతున్నది. ఇదే వీళ్లను వృత్త, మాత్రాచ్ఛందఃపథీనులు చేసే ప్రధానమైన విమర్శ. రంగారావు ముక్తచ్ఛందంలో ఈ క్రొత్త అభివ్యక్తితో, సాధించిన అంతర్లయతో ఈ ప్రమాదాన్ని దూరం చేసుకున్నాడు.

మనోభూమికలు అన్న ఖండకావ్యం మానవుడియొక్క అనేకములైన మనోదశలు పరిణామాలు దశలూ, అంతర్దశలూ చిత్రించే కావ్యం ఇందులో ఏడు ఖండాలు ఉన్నవి. ఒక్కో ఖండంలో ఒక్కొక దశయొక్క విపుల రేఖలు గీయబడ్డాయి.

ఏ ఖండానికీ ఇదమిద్ధమని పేరు చెప్పబడలేదు.

మొదటి ఖండంలో సృష్ట్యారంభంనుంచీ అశాంతియొక్క స్వరూపం నిర్వచింపబడింది. సృష్టికి పూర్వం శాంతమైన స్థితినుంచీ సద్యస్సృష్టిలో కలిగిన దుఃఖం, తన్మూలకమైన అశాంతియొక్క స్వరూపం నిరూపింపబడింది. సృష్టి అంటేనే దుఃఖం. ఇది సృష్టి ఉన్నంత కాలం సర్వతో వ్యాప్తంగా గోచరిస్తున్నది.

జీవితంలో ప్రతిక్షణ మొక సోపానం
అనుభవంతో గమ్యప్రాప్తిసోపానాలపై
కాలూనుతూ వెళ్లడం ప్రతి జీవికీ సహజం
జీవుని బహిస్స్వరూపం అశాంతి ప్రపంచం.

అని జీవునియొక్క బహిస్స్వరూపాన్ని నిర్వచించినాడు. అంటే జీవుని ఆనందమయమైన అంతస్స్వరూపం వేరే ఉందని ఈ కవి భావిస్తున్నాడు. ఈ కృతి అంతా ఈ అంతస్వరూపమైన ఆనందమైన స్థితిని పొందే ప్రయత్నమే.

ఈ విధంగా ఈ కావ్యం అశాంతిలో బయల్దేరి శాంతిమయమైన సర్వజనుః ఫలాభిముఖ జ్యోతీ రేఖను అందుకొనే యత్నం గోచరిస్తున్నది. ఒక విధంగా ఈరీతి టి. యస్. ఇలియట్ 'వేస్టులాండ్'ని గుర్తుకు తెస్తున్నది. ఇలియట్ కవిత సామాన్యంగా అందరికీ అర్థంకాదు. అర్థం అవడానికి తగిన సంస్కార బలం ఉండాలి. ఇలియట్ కవిత అర్థం అయ్యేందుకు సంస్కారం సంపాదించుకొన్నట్టే రంగారావు వంటి శాస్త్ర, మనో, వేదాంతాల సమన్వయం గల విలక్షణమైన అభివ్యంజన కల కవిత్వాన్ని అర్థం చేసుకోవడానికీ సంస్కారం కావాలి. సంస్కారం ఉంటే ఇది అర్థం కాకపోదు. ఈ సంస్కారమన్న ముసుగులో అయోమయమన్న దోషాన్ని నేను దాచడంలేదు. ఈయన కవితలో ఈ దోషం— ముఖ్యంగా ఈ పుస్తకంలో— చాలా తక్కువ.

ఈయన 'చాదస్త వ్యావహారిక వాది' కాదు. ఇందులో 'ము' ప్రత్యయాంత రూపాలు మొదలైన ప్రాచీనాంధ్ర భాషా స్వరూపము గోచరిస్తున్నది. ఈనాటి కవుల్లో సాధారణమైన అవ్యుత్పన్నత ఈ కవితలో గోచరించదు. వచన పద్యం వచ్చింతరువాత సాధింపబడని అక్షర రమ్యత ఈ కవితలో భాసిస్తున్నది. తెలుగు సంస్కృత శబ్దాలు ఒక లయానుగుణంగా కలసిపోతవి. సంస్కృత సమాసాలు అక్కడక్కడా పొదుగబడి ప్రకాశిస్తున్నవి. పూర్వం ఈ కవి సంస్కృతప్రాయంగా రాసేవాడు. ఇప్పుడు అభివ్యక్తిలోని గాంభీర్య మాధుర్యాల పురస్కరించుకునే సంస్కృత సమాస రచన చేస్తున్నాడు.

అయినా అక్కడక్కడ ఏవో కొన్ని శబ్ద సంబంధమైన లోపాలు లేకపోలేదు. 'తైక్ష్ణ్యత' 'సహజ సరిహద్దులు' 'సమున్మేష పృథ్వీభాగం' 'సహాచ్ఛాదవ మేఘమండలి' ఇవి రుచించని ప్రయోగాలు. ఇవే లేకుంటే ఎంతో స్వచ్ఛంగా ఉండేదీ ఖండ కావ్యం.

విజ్ఞానశాస్త్ర యుగంలో మానవుడు ఎట్లా వికసించిందీ, ముందుముందెట్లా వికసించేదీ వివరిస్తుంది రెండో ఖండం. మానవుడు బాధపడుతూనే ఉంటాడు వైకుంఠపాళిలోలాగా. ఈ ప్రపంచం "అతృప్తి చెందు ఏకాకృతి ప్రపంచం. బిందువు ప్రారంభం తెలియని పరిణామం సాగిపోవు రేఖా వలయం' అని వ్యాఖ్యానించుతాడు. మానవుని మనస్సు ఇలా సాగింది.

"సమార్ద్రమై, భాగవత తేజోభావమయమై;
కర్కశమై, దానవతా స్వభావ సంపిహితమై;
నగ్నమతి మానవుని అశాంతి హృదయం
తరువాత నేర్చుకుంది ప్రేమతో ద్వేషం"

మొదట ఈ మనస్సు నగ్నమైందే. ఆర్ద్రములూ, కర్కశములూ అయిన భావముల నాశ్రయించి యిది ప్రేమనూ ద్వేషాన్నీ నేర్చుకుంది. ఈ ప్రపంచం యిప్పుడు "సమ శక్తుల మధ్య సంఘర్షణలతో, దుర్బలుల ఆవేదనతో సంధ్యారుణ రక్తిమవలె సహజంగా శాంతంగా అశాంతి సంపరివ్యాప్తమై మహాకాశం, తిరిగి మొదలౌతుంది అణువుతో ఆశ్వాసం" అంటాడు. సమ శక్తులైన పెద్దరాజ్యాల సంఘర్షణా, చిన్న రాజ్యాల ఆవేదనా యిది సంధ్యా రక్తిమవలె సహజమైందంటాడు. ఈ ఉపమానం ఈ యుగంయొక్క అంతాన్నీ, అణువుతో ప్రారంభమయ్యే మరో నవయుగాన్నీ సూచిస్తున్నది. ఆ యుగంలోనే ఈ అశాంతికి ఆశ్వాసం ప్రారంభం అనడంవల్ల అదే సంతతానందమయమైంది కాదని ఆ యుగమూ దాటి అందుకోవలసిన అంతస్తు వేరే ఉందని గోచరిస్తున్నది. అందుకే ఈ ఖండం చివర ఈ విజ్ఞాన యుగంలో మానవుని స్థితిని వర్ణించి చివరకు అంటాడు—

"ఆరంభం— అశాంతి సంతరింపగా
యత్నించిన వినూతన నూత్నయుగం
పూర్వపు తన సహజ స్థితి రావడానికి
తూష్ణచరావేదనాగ్నితో, — అంతం."

ఈ పద్ధతిలో ఈ కావ్యాన్ని చదవాలి. విజ్ఞానశాస్త్ర విషయాలు చెప్పేప్పుడు వాటిని కవితా పరిభాషలో చెప్పాలనే ప్రయత్నం ప్రతిభామహితమైనది. ఈ విషయాలు ఆ పరిజ్ఞానం ఉన్నవారికే కాని స్ఫురించవు.

మూడో ఖండలో జీవుల ఆలోచనలోని భేదాలు లక్ష్యాలు చిత్రింపబడ్డవి. లోకంలో కొందరు కేవలం ఈబ్రతుకు సాగించడమే పరమార్థం అయిన వారు. వారికీ 'దీప్తమతు'లకూ భేదం ఉండనే ఉంటుంది.

'మన్వంతరాలుగా పరిక్రమించిపోవు
జగన్నాథ రథచక్రాలు పట్టుకొని
మృత్యువు ఊహలతో వదలని చీకటివలె
నీడలు వదలిపోలేని శైశిరాకారాలు.
సాంఘిక సమభావ స్థితి కందుకొనని
అన్నిజీవుల ఆరాటం— ఆరనికాష్ఠంవలె,
జీవితం క్రతువుగా పరిణమింప జేయు
మనః ప్రాణి ఆవేదన— జ్వలించే సప్తార్చివలె—

ఈ వాక్యాలలో జగన్నాథ రథచక్రాలన్న మాటలో శ్రీశ్రీ ఉద్యమంయొక్క లక్ష్యాన్ని ఉటంకించడం జరిగింది. ఈ ఉద్యమం ఆరని కాష్ఠం వంటిది. వాళ్ల లక్ష్యం అందుకొనడం సాధ్యమౌతుందా? అది ఆరని కాష్ఠం వంటిది. వీరికంటే అతీతంగా మనోజీవులు జీవితాన్నే క్రతువుగా పరిణమింప జేసేవారు— వారి ఆవేదన సప్తార్చి వంటిది. అగ్ని అన్న అర్థంలో వాడబడ్డ ఈ శబ్దం సప్తదశలలో ఈ రచయిత చిత్రించిన మనోభూమికలను కూడా వ్యంజిస్తున్నది. నాల్గో ఖండంలో అర్థచైతన్యావస్థ చెప్పబడింది. ఐదో ఖండం తనకు ఈశ్వరుని స్ఫూర్తి కలగడాన్ని చెప్పేది.

ఈ కావ్యంలో సాధక దశా, ఈశ్వర సాక్షాత్కార దశకు చెందిన లరో ఏదో ఖండాలు అత్యంతమూ ఉజ్జ్వలంగా ఉన్నవి. భావనలో, కల్పనలో, వ్యక్తిలో ఔదాత్త్యం పరిస్ఫుటంగా గోచరిస్తున్నది. ఐదో ఖండం చివర,

"నాకు కనిపించినది భగవంతుడని చెబితే
వాళ్లను వదిలివేశావనుకొని, అమాయకంగా
ఎవడికివాడు మనస్సులో సంతోషిస్తాడనుకుంటా"

విజ్ఞానశాస్త్రం మత్తులో వేదాంతాన్ని అందుకోలేని అల్పులని గూర్చి ఈ వాక్యాలు. వాళ్లు పాపం అదీ యిదీ విరుద్ధమనుకుంటారు. సాధకుడు "దేవతాత్మ పరిధివరకు విడివిడిగా, ఆవల ఇరువుర మొకటిగా సంవిలీనమై పోదాం" అంటాడు. ఈ జగత్తు యొక్క సరిహద్దు దాటితే తరువాత పరమేశ్వరుడే. అక్కడ భేదమే లేదు. చివరి ఖండంలో పరమేశ్వరుణ్ణి పొందుతూ సాధకుడు—

భూమిని మరచి పాత్రరుదార కాంతి పుంజంలా
విశ్వాత్మలో ఏకమై నిరాకారమైపోతే తప్ప
తనలో దూకితే ఈ అగ్నిని ఆర్పగలదా? సముద్రం
శరీరాంచలమాత్ర దప్పు జలబిందు సమూహం.

రాత్రివేళ దూరంగా కనిపించే అమృతాంశు బింబంలో సంవిలీన మౌదామనుకున్న జీవి యొక్క అగ్ని శిఖాభ శరీరాన్ని ఈ సముద్రం (వ్యావహారిక జగత్తు) భరించలేదు.

అశాంతితో ప్రారంభమైన కావ్యం చివర ఇలా ఉంది—

"అక్కడేగా రూపుకట్టున దెక్కడా
లభించని శాంతి
అక్కడే కన్పించునది
సర్వజనుష్పలాభిముఖజ్యోతీరేఖ
వ్యావర్తిత సృష్టియొక్క
అచ్ఛమైన తొలి వెలుగు రూపం"

ఈ విధంగా ఈ చివరి ఖండాలలోకి వచ్చేప్పటికి అద్వైత భావన సువిస్పష్టంగా గోచరిస్తున్నది.

బహుముఖీనమైన ఆధునిక కవితలో ఇది మహా తోవ.

— దామెర మల్లారెడ్డి.

"ఒకడు నాచన సోమన్న", "సాహిత్యధార" సమయమునకు అందకపోవుటచే ప్రచురించలేక పోయినాము.

సం. జ.

## PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.

R. C. No. 973 M 4/58. Dated 8-6-59.

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and Public Libraries in the State.

Name: JAYANTI

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*



## HEALTH & LOCAL ADMINISTRATION DEPARTMENT

G. O. Ms. No: 2379 Tel. A D/26 September 59

The Government commend the purchase of the Telugu Literary Monthly Magazine "JAYANTI" published by Sri J. Gouthama Rao, by the libraries maintained by them.

M. LOKANATHAM,
*Dy. Secretary to Government.*

"జయంతి" రైల్వేస్టేషనులలోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలలో దొరుకును.

---

[illegible]
[illegible]